# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**0-75** పైసలు

సంవత్సర చందా
రూ. **8-40**

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంగాదు

చిన్నపిల్లకు టైపుచేయుట నేర్చుకొనుటకంటె ఇంకేదీ ఎక్కువ సరదా కాదు. తాను నేర్చుకుంటిని గదా అని ఆమె సర్వదా సంతుష్టి పడుతుంది.



మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పసుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పసుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ శ్రద్ధపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పసుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్న యెడల పళ్లు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. 1

## COUPON

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

కిందటి సంచికతో "నవాబునందిని" పూర్తి అయింది. దాని స్థానంలో "పాతాళదుర్గం" అనే కొత్త రంగుల బొమ్మ సీరియల్ ప్రారంభిస్తున్నాం. "తోకచుక్క", "మకరదేవత", "ముగ్గురు మాంత్రికులు", "కంచుకోట", "జ్వాలాద్వీపం", "రాకాసిలోయ" మొదలైన కథలలాగే "పాతాళదుర్గం" కూడా అద్భుత, వీర, భీభత్స రసాలతో కూడి ఉండి, పాఠకులకు ఆసక్తి కలిగించ గలదని ఆశిస్తున్నాము.

కిందటి సంచికలో ప్రారంభమైన "శక్తివేగుడు" అన్న పెద్ద కథ ఈ సంచికలో ముగుస్తున్నది. ఇలాటి విచిత్రమైన కథలు అనేకంగా బృహత్కథ నుంచి ఇతర దేశాలకు వెళ్ళి, ఇతర భాషలలో రూపాంతరాలు పొందాయి., దీనినిబట్టి బృహత్కథ యొక్క గొప్పతనం స్పష్టమవుతుంది.

సంపుటి: 38 - మే 1966 - సంచిక: 5





# భారత చరిత్ర



శివాజీ కేవలమూ మహావీరుడూ, యుద్ధ తంత్రజ్ఞుడూ మాత్రమే కాదు, పరిపాలనలో చాలా సమర్థుడు. అందుచేత అతను ప్రజా పాలనను సంఘటించటం లోనూ, రాజనీతి లోనూ గొప్ప విజయాన్ని సాధించాడు. అయన పరిపాలనలో తానే సర్వాధికారి. అయితే రాజ్యతంత్రం నడపటానికి అయన కింద అష్టప్రధాను లుండేవారు. పేష్వా అనే వాడు ముఖ్యమంత్రి. అమాత్యు డనే వాడు ఆర్థికమంత్రి. మంత్రి అనే వాడు రాజుగారి నిత్య కార్యక్రమాల చిఠా తయారు చేసేవాడు. సచివు డనేవాడు రాజుగారికి లేఖకుడుగా ఉంటూ, జమా బందీ పనులు చూస్తాడు. సుమంతు వైదేశిక వ్యవహారాలు చూస్తాడు. సేనాపతి సైన్యానికి అధిపతి, పండిత్‌రావు అనేవాడు రాజ పురోహితుడు. న్యాయాధీశుడు అనేవాడు ప్రధాన న్యాయమూర్తి.

రాజ్యాంగంలో 30 శాఖ లుండేవి. రాజ్యం అనేక రాష్ట్రాలుగా విభజించి ఉండేది. ఒక్కొక్క రాష్ట్రాని కొక రాజ ప్రతినిధి ఉండేవాడు. శివాజీ తన రాజ్యంలో పన్నులు వసూలు చెయ్యటమే గాక, మొగలుల అధీనం లోనూ, బిజాపూరు నవాబు అధీనం లోనూ, పోర్చుగీసువాళ్ళ అధీనం లోనూ ఉండే కొన్ని ప్రాంతాలలో కూడా "చౌథ్" అనే పన్ను వసూలు చేసేవాడు.

శివాజీ తన సైన్యాన్ని కూడా పున ర్నిర్మించి, చాలా పటిష్ఠం చేశాడు. అందులో నౌకాశాఖ చేర్చాడు, తన సేనలకు గాను ఫిరంగులూ, తుపాకులూ సంపాదించాడు. శివాజీకి అనేక దుర్గా లుండేవి. ప్రతి దుర్గానికి సమాన ప్రతిపత్తి గల ముగ్గురు అధికారులు—హవల్దార్, సబ్నీస్, సర్నౌబత్—ఉండేవారు. ప్రతి సేన లోనూ అన్ని

## 56. శివాజీ పరిపాలన

కులాల వాళ్ళూ ఉండేటట్టు శివాజీ చూశాడు. సేనలో క్రమశిక్షణ మహనిశితంగా ఉండేది. సేనల వెంట స్త్రీలు ఉండరాదు. ఏ సైనికు డైనా స్త్రీని వెంటబెట్టుకుని వెళితే వాడికి శిరశ్ఛేదమే దండన. బ్రాహ్మణులనూ, గోవు లనూ సైనికులు బంధించరాదు. వాహనా లుగా ఎద్దులను మాత్రం పట్టుకోవచ్చును. యుద్ధకాలంలో సైనికులు నిర్దుష్టప్రవర్త నులై ఉండాలి.

శివాజీ సైన్యం లోని అశ్వికవిభాగంలో 25 అశ్వికులు ఒక దళం. వారి పైన ఒక హవల్దా రుండేవాడు. అయిదుగురు హవల్దా రుల పైన ఒక జుమ్లాదా రుండేవాడు. పదిమంది జుమ్లాదార్ల పైన ఒక హజారీ ఉండేవాడు. హజారీల పైన పాంజ్‌హజా రీలూ, సర్నోబత్ అనే సర్వసేనానీ ఉండే వారు. కాల్బలంలో తొమ్మిదిమంది సైని కులు ఒక దళం, వారి పైన ఒక నాయిక్ ఉండేవాడు. అయిదుగురు నాయికుల పైన ఒక హవల్దారూ, ఇద్దరు, ముగ్గురు హవల్దార్ల పైన ఒక జుమ్లాదారూ, పదిమంది జుమ్లా దార్ల పైన ఒక హజారీ ఉండేవారు.

యోధుడు గానూ, పాలకుడు గానూ కూడా భారతచరిత్రలో శివాజీకి గల స్థానం గొప్పది. అతను తన ఎదటికి వచ్చిన వాణ్ణి



మంత్రముగ్ధుణ్ణి చేసేసేవాడు: ధైర్యసాహ సాల తోనూ, రాజతంత్రం తోనూ అతను జాగీర్దారు పదవి నుంచి ఛత్రపతి పదవికి వచ్చాడు. చెల్లాచెదురుగా ఉండిన మహ రాష్ట్ర జాతిని అతను ఏకం చెయ్యగలిగాడు. అతను నిర్మించిన మరాఠీజాతి, 18 వ శతాబ్దిలో కూడా భారతదేశాని కంతకూ బలవత్తర మైనదిగా ఉండి, బ్రిటిషు బలాన్ని ప్రతిఘటించి, పోటీ చేసింది.

జాతీయ పునరుజ్జీవనం కలిగించటాని కవసరమైన గుణాలన్నీ శివాజీలో ఉండేవి. అతను రంజిత్‌సింగు లాగా విదేశీయుల సహకారంతో రాజ్యపాలన సాగించలేదు.

అతని సైన్యాలకు అతని మనుషులే శిక్షణ ఇచ్చారు. అతను చేసిన ఏర్పాట్లు దీర్ఘ కాలం నిలిచాయి, ఇతరుల చేత అనుక రించబడ్డాయి. అతన్ని తీవ్రంగా విమర్శిం చిన ముస్లిముచరిత్రకారులు సైతం అతని సద్గుణాలను ఒప్పుకున్నారు. అతను తన రాజ్యం లోని ప్రజల గౌరవం తన గౌరవంగా భావించాడు. తనకు చిక్కిన ముస్లిము పిల్లలనూ, స్త్రీలనూ తాను గౌరవించి, తన సైనికులు గౌరవించేటట్టు చూశాడు. ఈ విషయంలో ఎవరు తన ఆజ్ఞలను మీరినా తీవ్రంగా శిక్షించాడు. అతనెన్నడూ స్త్రీల జోలికీ, మసీదుల జోలికీ, యుద్ధంలో పాల్గొనని వారి జోలికీ పోలేదు. యుద్ధ ఖైదీలను మర్యాదగా విడుదల చేశాడు. దేశీయ సామ్రాజ్యం స్థాపించటం తన ఏకైక లక్ష్యంగా పెట్టుకుని, దాని కోసం దీక్షగా కృషిచేశాడు. కాని ఆ పని ముగిసే లోపల అతని ఆయుువు పూర్తి అయింది.

అభ్యంతర జీవితంలో కూడా శివాజీ చాలా నీతిపరుడు. ఆ కాలపువారిలో ఉండిన వ్యసనాలు అతనిలో లేవు. తన తల్లి, గురు వైన సమర్థరామదాసూ చిన్నతనంలో బోధించిన ఆదర్శాలను అత నెన్నడూ మరవలేదు. మహారాష్ట్ర జాతిని ఉద్ధరించ టాని కతను మతం మీద హెచ్చుగా ఆధార పడ్డాడు. హిందూమతోద్ధరణను ఎప్పుడూ ప్రోత్సహించాడు. అతని దృష్టిలో మతం ఒక సజీవశక్తి; అది మనిషియొక్క శీలాన్నీ, సౌజన్యాన్నీ పెంపొందిస్తుంది. అందుచేతనే అతనిలో మతోన్మాదం లేదు. ఇతర మతాల పట్ల అతనికి ద్వేషమూ లేదు. ముస్లిముసంతు లంటే అతనికి చాలా భక్తి; మసీదులు వగైరాల దీపాల ఖర్చు కింద మాన్యా లిచ్చేశాడు. అతని అను చరులు ఏ స్థలాన్నయినా కొల్లగొట్టినప్పుడు, మసీదులనూ, కొరానునూ, స్త్రీలనూ మర్యా దగా చూసేవారు.



# నేహ్రూ కథ

## 23



**1923** లో అలహాబాదు మునిసిపల్ చైర్మనుగా ఎన్నికయిన జవాహరు ఒక్క ఏడాదిలోనే విసుగెత్తిపోయాడు. అతని కృషిని అంతా మెచ్చుకున్నారు; మిగిలిన సభ్యులందరూ ఎంతో సహకరించారు. అతని హయాంలో పనులు చురుకుగా సాగాయి; కొంత అభివృద్ధి కూడా కనిపించింది. అయినా జవాహరుకు ఆ పదవిలో ఉండ బుద్ధి కాలేదు. కారణం, మునిసిపాలిటీలు ప్రజాహితం కోసం పాటుపడేటందుకు ప్రభుత్వం ఏ మాత్రమూ కలిసి రాలేదు. మునిసిపాలిటీలకు గల అధికారాలే చాలా పరిమితమైనవి. ఆ పరిమితిలోనే ఏదైనా సత్కార్యం తలపెట్టినా, ప్రభుత్వం దాన్ని ఒకంతట మంజూరు చెయ్యదు.

జవాహరు మూడేళ్ళపాటు చైర్మనుగా ఉండటానికి ఎన్నిక అయాడు. కాని ప్రాణం విసిగిన కారణంగా ఏడాదికల్లా తన పదవికి రాజీనామా ఇవ్వ యత్నించాడు. అయితే అతని అనుచరులు అడ్డుపడ్డారు. మరొక్క ఏడు అసంతృప్తిగా ఆ పదవి నిర్వహించిన మీదట **1925** లో అతను చైర్మను పదవి వదిలేసుకున్నాడు. అందుకు ముఖ్యకారణమేమంటే, అతని భార్య కమలకు జబ్బు తీవ్రమయింది. ఆమె నెలల తరబడి లక్నో ఆస్పత్రిలో చికిత్స పొందింది. ఆ యేడు కాంగ్రెసు కాన్పూరులో జరిగింది. జవాహరు ఇంకా కాంగ్రెసు కార్యదర్శి. అందుచేత అతను కాన్పూరు, లక్నో, అలహాబాదుల మధ్య కాలు కాలిన పిల్లిలాగా తిరిగాడు. అతని మనసు ఏ ఒక పనిలోనూ నిమగ్నం కాలేదు.

కమలను స్విట్జర్లాండు తీసుకుపోయి చికిత్స చేయించమన్నారు. జవాహరుకు



కూడా దూరదేశం వెళ్ళటానికి మంచి సాకు దొరికింది. దూరం పోతేగాని అతని మనసు కలకదేరేటట్టు కనబడలేదు. మే 1926 లో జవాహర్, కమలా, వారి కుమార్తె ఇందిరా సముద్రం మీద వెనిస్‌కు బయలుదేరారు. అంతకుముందే యూరప్‌కు వెళ్ళాలనుకుంటూ ఉండిన విజయలక్ష్మి, ఆమె భర్త అయిన రంజిత్‌పండిత్ కూడా వారితో కలిసే ప్రయాణమయారు.

జవాహరు 13 ఏళ్ళ అనంతరం తిరిగి యూరప్ వెళ్ళి అక్కడ ఎన్నో మార్పులు గమనించారు. ఆ 13 ఏళ్ళ కాలంలో ఒక ప్రపంచయుద్ధమూ, ఒక విప్లవమూ, బహువిధ పరిణామాలూ జరిగాయి. అతను యూరపులో ఏడాదిపైన తొమ్మిది మాసాల పాటు ఉండిపోయాడు. అందులో చాలా భాగం స్విట్జర్లాండులోని జినీవా లోనే గడిచింది. అతని ఇంకో చెల్లెలు కృష్ణ కూడా 1926 వేసవిలో అక్కడికి వచ్చేసింది.

కమల మాంటానా వద్ద గల శానటోరియంలో చికిత్స పొందింది. ఆమె ఆరోగ్యం కొంత మెరుగయాక భార్యాభర్తలు ఫ్రాన్సుకూ, జర్మనీకి, ఇంగ్లాండుకూ చిన్న చిన్న ప్రయాణాలు చేశారు. వాళ్ళుండిన చోక కొండ శిఖరాన. చలికాలం వచ్చి మంచు కప్పేసినప్పుడు జవాహరుకు తాను ఇండియాకూ, యూరపుకూ కూడా ఎడంగా ఉన్నానని పించేది. అతను మంచు వ్యాయామక్రీడలలో నిమగ్నుడైపోయి, రాజకీయాలు సంబంధించినంతవరకు ప్రేక్షకుడుగా ఉండిపోయాడు. కాలం మందంగా గడిచింది. కమల క్రమంగా ఆరోగ్యాన్నీ, బలాన్నీ పొందుతున్నది. ఎవరితోనూ సంపర్కం ఉండేది కాదు.

ఈ కాలంలో జవాహరుకు కొందరు మాజీ విప్లవవీరులు తగిలారు. వారందరూ ఆరిపోయిన దీపాలు. శ్యామాజీకృష్ణవర్మా, మహేంద్రప్రతాప్, మౌల్వీ ఓబీదుల్లా,

మౌల్వీ బర్కతుల్లా మొదలైన వారిని అతను చూశాడు.

బెర్లినులో ఇండియన్ కమిటీ ఒకటి ఉండేది. 1914 లో యుద్ధం వచ్చినప్పుడు జర్మను విశ్వవిద్యాలయాలలో ఉండే భారతీయ యువకులు, జర్మనీ మీది ప్రేమచేత గాక, బ్రిటనుపై గల ద్వేషంతో ఒక కమిటీగా ఏర్పడి, జర్మనీకి సహాయపడ బూనుకున్నారు. జర్మనీ ఈ కమిటీకి గొప్ప ఆదరం చూపింది. కాని యుద్ధం ముగియగానే ఈ కమిటీ విచ్ఛిన్నమయింది. వారిలో కొద్ది మందిని మాత్రమే బ్రిటిషువాళ్ళు ఇండియాకు రానిచ్చారు. ఓడిపోయిన జర్మనీలో వాళ్ళకు స్థానం లేదు, ఇండియాకు తిరిగిరానూ లేరు. వారు రెంటికీ చెడ్డ రేవళ్ళయారు.

1926 లోనే ఇండియాలో లెజిస్లేటివు ఎసెంబ్లీకీ, రాష్ట్రాలలో కౌన్సిళ్ళకూ ఎన్నికలు జరిగాయి. జవాహరుకు వాటియందు ఆసక్తి ఏమీ లేదు. కాని ఈ సందర్భంలో దేశంలో బయలుదేరిన కొన్ని పరిణామాలు జవాహరును కలవరపరిచాయి.

శాసనసభలలో స్వరాజ్యపార్టీ (కాంగ్రెసు శాఖను) ప్రతిఘటించటానికిగాను, పండిత మదనమోహనమాలవీయా, లాలాలజ్పత్



రాయ్‌గార్లు నేషనలిస్టు పార్టీ అనే దాన్ని వ్యవస్థాపించారు. ఇది ఏ సూత్రాల ఆధారం మీద సృష్టి అయినదీ జవాహరుకు తెలియనే లేదు. ఈ కొత్త పార్టీ స్వరాజ్యపార్టీ కన్న కూడా కుడిపక్షాన ఉండింది. ఇది కేవలమూ హిందువుల పార్టీ, హిందూమహాసభతో కలిసి పని చేసింది.

మాలవీయ స్వభావతః హిందూవైఖరి గలవాడు. ఆయన పేరుకు కాంగ్రెసులో ఉంటూవచ్చినప్పటికీ, కాంగ్రెసు ప్రారంభించిన సహాయనిరాకరణ, శాసనోల్లంఘనోద్యమాల పట్ల సానుభూతి కలవాడు కాదు. ఏనాడూ ఆయన వర్కింగు కమిటీ సభ్యు

డుగా ఉండలేదు, కాంగ్రెసు ఆ దేశాలకు కట్టుబడలేదు. అదీగాక ఆయన హిందూ మహాసభ అగ్రనాయకులలో ఒకడు. ఆయన ప్రధానంగా జాతీయవాది; సాంఘిక, ఆర్థిక మార్పులతో ఆయనకు నిమిత్తం లేదు. దేశంలోని సంస్థానాధీశులకూ, గొప్ప జమీందార్లకూ ఆయన అప్తుడు. రాజకీయంగా ఆయన కోరినది భారతదేశం పైన విదేశీయుల ఆధిపత్యం తొలగటమే. యుద్ధానంతర ప్రపంచపు పోకడ లేవీ ఆయనకు తెలియవు.

అందుచేత ఆయనకు స్వరాజ్య పార్టీ అతివాత పార్టీగా కనిపించటంలో ఆశ్చర్యం లేదు. కనుకనే ఆయన అంతకంటె మితవాదధోరణి గల పార్టీని నెలకొల్పి, దానికి నాయకత్వంవహించాడు. ఇదంతా జవాహరు అర్థం చేసుకోగలిగాడు. కాని లజ్పత్‌రాయ్ ఈ వైఖరి అవలంబించటం అతనికి విస్మయం కలిగించింది. ఎన్నికల ప్రచారంలో లాలాజీ కాంగ్రెసు పైన చేసిన అస్పష్టమైన ఆరోపణలు కూడా అతనికి ఆశ్చర్యం కలిగించాయి.

అయితే, దేశంలో మతతత్వం ప్రబలుతున్నది. అందుచేత ఇలాటి పార్టీలు రావటం తప్పనిసరి అయింది. అధిక సంఖ్యాకులైన హిందువులంటే అల్పసంఖ్యాకులైన ముస్లిములకు అనుమానం. పంజాబులో ముస్లిములది అధిక సంఖ్యాకవర్గం; అక్కడి హిందువులకూ, సిక్కులకూ ముస్లిములు తమ్ము అణచివేస్తారని అనుమానం.

ఈ మతతత్వం పెరగటంతో స్వరాజ్య పార్టీ దెబ్బతిన్నది. అందులోని ముస్లిములు అందులో నుంచి వెళ్ళిపోయి మతపార్టీలో చేరారు; కొందరు హిందువులు నేషనలిస్టు పార్టీలో చేరారు. లాలా లజ్పత్‌రాయ్‌కి పంజాబులో గొప్ప పలుకుబడి ఉన్నది. మాలవీయా, ఆయనా ఏకంకావటంతో నేషనలిస్టు పార్టీకి గొప్ప ప్రతిష్ఠ చేకూరింది.





# పాతాళదుర్గం

కుంతలదేశపు మంత్రి కొడుకైన శశికాంతుడనేవాడొకనాడు, భద్రుడూ, జయంతుడనే మిత్రులిద్దరిని వెంటబెట్టుకుని, వేటకై అరణ్యానికి వెళ్ళాడు. అరణ్యంలో లేళ్ళూ, దుప్పులూ, అడవిపందులూ సమృద్ధిగా వున్నవి. కాని, శశికాంతుడూ, అతడి మిత్రులూ వాటిని వేటాడక, ఎక్కడైనా సింహం కనబడుతుందేమో అని వెతుక్కుంటూ అరణ్యంలో చాలా దూరం వెళ్ళారు. మిట్టమధ్యాహ్నం వేళకు వాళ్ళ శ్రమ ఫలించింది. వాళ్ళొక కొండవాగు వెంట వెళుతూండగా, వాగు అవతలి ఒడ్డున సింహం ఒకటి నిలబడి ఉండటం శశికాంతుడి కంటబడింది. సింహం అప్పుడే వాగులో నీరు తాగి, తిరిగి అరణ్యంలో ప్రవేశించేందుకు బయలుదేరింది.

శశికాంతుడా సింహాన్ని తన మిత్రులకు చూపుతూ, "మనం గుర్రాలను ఇక్కడే వదిలి నిశ్శబ్దంగా వాగు దాటి, సింహాన్ని అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టుదాం. మన బాణాల్లో ఏదో ఒకదానికి అది గురి కాక పోదు," అన్నాడు.

గుర్రం దిగి వాగు కేసి బయలుదేరిన శశికాంతుణ్ణి, జయంతుడు భుజం పట్టుకుని ఆపి, "శశికాంతా, తొందరపడకు. ఆ వాగు అవతల వున్న అరణ్యభాగం కదంబరాజ్యం లోనిది. ఆ రాజుకూ మనకూ మధ్య వచ్చి గడ్డి వేస్తే భగ్గు మంటున్నది కదా! మనం





రాజుకూ, చర్మాన్ని ఆయన ఏకైక పుత్రిక కాంతిసేనకూ బహుమానంగా పంపుదాం," అన్నాడు భద్రుడు.

ఈ మాటలకు శశికాంతుడు పెద్దగా నవ్వాడు. సింహం తల తిప్పి, తన కేసి వస్తున్న వేటగాళ్ళను చూస్తూనే, మెల్లగా గర్జించి తోక ఆడిస్తూ ముందుకు రెండడుగులు వేసింది. అదే సమయంలో శశికాంతుడు సింహం కంఠానికి బాణం గురిచేసి వదిలాడు. బాణం రివ్వుమంటూ పోయి సింహాన్ని తాకింది. ఆ దెబ్బ తింటూనే సింహం మహోధృతంగా గర్జిస్తూ వాగు కేసి ఛెంగున దూకింది.

వాళ్ళ రాజ్యసరిహద్దులు దాటటం ప్రమాద కారణం కావచ్చు," అన్నాడు.

వేట తమకంలో వున్న శశికాంతుడు తన మిత్రుడి సలహా విని, అవహేళనగా నవ్వి, "నే ననలే పిరికివాణ్ణి, మరీ అంతగా పిరికి మందు పోయకు! మనం, కదంబరాజ్యాన్ని జయించేందుకు జైత్రయాత్ర మీద ఆ రాజ్యంలో ప్రవేశించటం లేదు, క్రూర మృగాన్ని వేటాడేందుకు పోతున్నాం. ఆ పని ముగియగానే, తిరిగి మన రాజ్యం ప్రవేశిస్తాం," అన్నాడు.

"శశికాంతా, బాగా చెప్పావు. సింహం మనపాల బడితే, మాంసాన్ని కదంబ

శశికాంతుడూ అతడి మిత్రులూ చప్పున విడిపోయి, మోకాళ్ళ లోతున వున్న వాగును తృటికాలంలో దాటి, సింహం మీద మూడు వైపుల నుంచీ బాణాలు వదిలారు. ఈ సారి బాణాల్లో ఒకటి సింహం డొక్కలో బలంగా నాటుకున్నది. అది గర్జిస్తూ తన మీదికి వస్తున్న ముగ్గురి లోనూ అందుబాటులో వున్న శశికాంతుడి మీదికి కుప్పించి దూకింది. శశికాంతుడు ఇక విల్లంబులతో పని కాదని కత్తి దూశాడు. అంతలో చెట్ల చాటున కలకలం బయలు దేరింది. మరుక్షణం ఒక ఈటె దూసు





కుంటూ వచ్చి, సింహం తలను బలంగా తాకింది. శశికాంతుడూ, అతడి మిత్రులూ కలకలం వచ్చిన వైపుకు చూసేంతలో, "సరి హద్దులు దాటిన శత్రువులను చంపండి!" అన్న కేకా, ఆ వెంటనే రివ్వురివ్వు మంటూ బాణాలూ వచ్చి వారి మీద పడినై.

శశికాంతుడు బాగా గాయపడి నేల కొరుగుతూ, "భద్రా, జయంతా, మీరు త్వరగా పారిపొండి. పొంచివుండి కపట యుద్ధం చేసే శత్రువులతో పోరి లాభం లేదు," అంటూ కేక పెట్టాడు.

ఆ సరికే జయంతుడు అయువు పట్టున బాణం దెబ్బ తిని కింద పడిపోయాడు. భద్రుడు పారిపోయేందుకు వెనుదిరిగేంతలో అతడి వీపున ఒక శత్రుబాణం వచ్చి తగి లింది. కాని, అత డా బాధను లెక్క చేయ కుండా, అతి వేగంగా పరిగెత్తి, వాగు దాటి చెట్ల కింద వున్న గుర్రాలను చేరుకుని, అతి కష్టం మీద గుర్రం ఎక్కాడు. గుర్రం వెనుదిరిగి పరిగెత్త సాగింది. దానితో బాటు మిగిలిన రెండు గుర్రాలూ బయలుదేరినై. వాగు వైపు నుంచి కొందరు శత్రుసైనికులు పరిగెత్తుకుంటూ వచ్చి, భద్రుడి కేసి బాణాలు వదలసాగారు. "వాణ్ణి ప్రాణా లతో పోనీకండి. ఇక్కడ గాయపడి ప్రాణాలు విడుస్తున్నవాడు కుంతలదేశ





దూరం గుర్రం వెనకగా పరిగెత్తి, అది కనబడకుండా పోవటంతో, తిరిగివచ్చారు. వాళ్ళకు కళ్ళెపు తాడు చెట్టు మోదుకు తగులుకు పోవటం వల్ల పారిపో లేకపోయిన శశికాంతుడి గుర్రం మాత్రం దొరికింది.

"మహారాజా! క్షమించండి. ఆ గాయ పడిన శత్రువుతో గుర్రాలు రెండూ మహా రణ్యంలో కనబడకుండా పోయినై. ఎంతో శ్రమపడి దీన్ని పట్టుకో గలిగాం. ఇది పంచ కళ్యాణిలా వున్నది. విలువైన జీనూ అవీ చూస్తుంటే, యిది కుంతల దేశపు మంత్రి కొడుకుదని మా కనుమానం కలుగు తున్నది," అన్నారు సైనికులు, గుర్రాన్ని తమ ఏలిక ముందుకు నడిపించుకు పోయి.

కదంబరాజు ఉగ్రసేనుడు నిప్పులు చెరిగే కళ్ళతో ఆ సైనికుల నో క్షణం చూసి, పక్కన చేతులు కట్టుకు నిలబడి వున్న సేనానాయకుడి కేసి తలతిప్పి, "సేనానీ, గాయపడిన శత్రువును కూడా చేజిక్కిం చుకోలేని అర్భకు లన్నమాట, మన సైని కులు! వీళ్ళ ధైర్యసాహసాలను నమ్ము కునేనా, మనం కుంతలరాజుతో వైరం పెట్టుకున్నది?" అన్నాడు ఈసడింపుగా.

సేనానాయకుడు ఏదో చెప్పబోయి, రాజు ముఖం మీది ఉగ్రత్వం చూసి,

మంత్రి కొడుకులా వున్నాడు," అంటూ వాళ్ళకు వెనక నుంచి హెచ్చరికలు విన బడుతున్నవి.

భద్రుడు యివేమీ వినే స్థితిలో లేడు. అతను గుర్రం జూలు పట్టుకుని, దాని మెడమీదికి ఒరిగిపోయాడు. తనకు తెలిసిన దారి గనక గుర్రం, అతణ్ణి సూటిగా రాజ ధానీ నగరం కేసి తీసుకుపో సాగింది.

అక్కడ కొండవాగు వద్ద గాయపడిన శశికాంత జయంతుల చుట్టూ చాలామంది ఆయుధపాణులు చేరారు. సింహం అప్ప టికే ప్రాణాలు విడిచింది. భద్రుణ్ణి చంప జూచిన శత్రుసైనికులు అరణ్యంలో కొంత



"మహారాజా!" అంటూ నీళ్ళు నమల సాగాడు. ఉగ్రసేనుడు శశికాంతుణ్ణి సమీపించి, నిశ్చలంగా పడివున్న అతణ్ణి ఎడమ కాలితో అటూ యిటూ కదిలించి చూసి, "వీడు మంత్రికొడుకే, అనుమానం లేదు. ఇంకొంచం ప్రాణం వున్నట్టు కనబడుతున్నది. వీణ్ణి ఎత్తుకుపోయి, ఆ కొండగుహల్లో ఎక్కడనైనా పారవేసి రండి, అయిపూ అజా దొరక్కుండా ఏ సింహమో తిని జీర్ణించుకుంటుంది. సరే, ఆ రెండోవాడి మాటేమిటి?" అన్నాడు.

ఇద్దరు సైనికులు జయంతుణ్ణి కదిలించి చూసి, "వీడి ప్రాణం ఎప్పుడో గాల్లో కలిసింది మహారాజా!" అన్నారు.

"అయితే, వాణ్ణీ ఆ కొండగుహ లోనే పారవెయ్యండి," అంటూ ఉగ్రసేనుడు సేనాని కేసి తిరిగి, "సేనానీ! ఇవ్వాళ మనం వేటకు బయలుదేరిన వేళ మంచిది కాదు. నేను బాణం గురిచూసి వదిలేటప్పుడు వీళ్ళు మామూలు కుంతలరాజ్య సైనికు లనుకున్నాను తప్ప, సాక్షాత్తూ ఆ దేశపు మంత్రికొడుకూ, వాడి స్నేహితులూ అయి ఉంటారని అనుమానించ లేదు. ఆ రాజు మనకన్న ఎన్నో రెట్లు బలవంతుడు, మంత్రి బుద్ధిచాతుర్యం మనం



ఎరిగినదే! మనం నగరానికి వెంటనే తిరిగి వెళ్ళి, మన సరిహద్దు సైనికుల వల్ల పొరపాటు జరిగిపోయిందని కుంతలరాజు నమ్మే విధంగా, ఏదైనా మంచి పథకం ఆలోచించాలి," అన్నాడు.

"అవును మహారాజా, అవును. అందుకు మన మహామంత్రులు సర్వసమర్థులు," అన్నాడు సేనానాయకుడు.

ఉగ్రసేనుడు మారు మాటాడకుండా గుర్రాన్నెక్కి బయలుదేరాడు. అతడికి వెనకగా సేనాని కదిలాడు. సైనికుల్లో ఒక పదిమంది వెనక నిలబడిపోయి శశికాంతుణ్ణీ, జయంతుణ్ణీ చాపచుట్టల లాగా భుజాల





మీద వేసుకుని పరిహాసంగా, "ఓహెూం, ఓహెూం బీ," అంటూ కొండగుహల కేసి పరిగెత్తారు.

గాయపడిన భద్రుణ్ణి మోసుకుంటూ బయలుదేరిన గుర్రం, నగర ద్వారాలు మూసే వేళకు అక్కడికి చేరింది. మంత్రి కుమారుడి కోసం ఎదురు చూస్తున్న ద్వార రక్షకులు, అతడి మిత్రుడైన భద్రుణ్ణి ఆ స్థితిలో చూసి, గాభరా పడిపోయారు. భద్రుడు బతికి వున్నాడో లేదో కూడా పరీక్షించి చూసేందుకు వాళ్ళు భయపడ్డారు. జయంతు డెక్కి వెళ్ళిన గుర్రం భద్రుడి గుర్రం వెంట వున్నది.

ద్వారరక్షకులు భద్రు డున్న గుర్రం వెంట కాగడాలు తీసుకుని రాజనగరు కేసి బయలుదేరారు. వెన్నులో బాణం గుచ్చుకుని వున్న మనిషిని రాజవీధి వెంట మోసుకుపోయే గుర్రాన్నీ, దాని వెనకగా కాగడాలు పట్టి నడుస్తున్న భటులనూ చూసి, యీ వింత ఏమిటా అని పౌరులు గుంపులు గుంపులుగా పోగయారు.

గుర్రం నేరుగా రాజప్రాసాద ఆవరణ ప్రవేశించి, గుర్రపుసాల వద్దకు వెళ్ళి నిలబడింది. ఈ లోపుగా, వార్త తెలియటంతో, రాజు శతభానుడూ, మంత్రి గంగాధరుడూ అక్కడికి వచ్చారు. భద్రుణ్ణి నౌకర్లు జాగ్రత్తగా గుర్రం మీంచి దింపారు. ఆస్థాన వైద్యుడు అతన్ని పరీక్షించి చూసి, వీపులో గుచ్చుకుని వున్న బాణాన్ని నేర్పుగా లాగాడు. ఆ సమయంలో భద్రుడిలో కొంచెం చలనం కనిపించింది. వైద్యుడు అతడి నాడి పరీక్షించి, "మహారాజా! నా శక్తి కొలదీ ప్రయత్నిస్తాను. దైవసహాయం కూడా వుంటే, భద్రుడు జీవించే అవకాశం వున్నది," అన్నాడు.

భద్రుణ్ణి ఒక మంచం మీద పడుకోబెట్టి నౌకర్లు అతణ్ణి భవనం లోకి తీసుకుపోయారు. అంతవరకూ భద్రుడికి తగిలిన





బాణాన్ని పరీక్షించి చూస్తున్న మంత్రి, సేవకుల్లోకణ్ణి పిలిచి, బాణాన్ని అతని చేతి కిస్తూ, "దీన్ని బాగా కడిగి శుభ్రపరిచి తీసుకురా," అని ఆజ్ఞాపించాడు.

"శశికాంతుడూ, జయంతుడూ ఏమైనట్టు? మహామంత్రీ, మన రాజ్యం లోనే మనకు ఇంత ప్రబలులైన శత్రువు లున్నారని, నే నెన్నడూ అనుమానించలేదు," అన్నాడు రాజు శతభానుడు.

"మహారాజా! ఈ దురాగతం మన రాజ్యంలో జరిగింది కాదని నాకు తోస్తున్నది. భద్రుడు బతికి బయట పడితే, అరణ్యంలో జరిగిం దేమిటో మనకు పూర్తిగా తెలిసిపోతుంది. శశికాంతుడూ, జయంతుడూ తిరిగి వస్తారన్న నమ్మకం నాక్కలగటం లేదు. భద్రుణ్ణి గాయపరిచిన బాణం మీద ముద్రితమైన చిహ్నాలు చూస్తూంటే......" అంటూ మంత్రి గంగాధరుడు ఉత్తరీయంతో కళ్ళు తుడుచుకున్నాడు. శతభానుడి మనస్సు కలవరపడింది. మంత్రికి శశికాంతుడు ఏకైక పుత్రుడు. ఓదార్పు మాటలు ఎన్ని చెప్పి మాత్రం ప్రయోజన మేమిటి?

మంత్రి ఇచ్చిన బాణాన్ని రక్తం లేకుండా శుభ్రంగా కడిగి, గుడ్డతో తుడిచి, సేవకుడు దాన్ని తెచ్చి ఆయన కిచ్చాడు. గంగాధరుడు బాణాన్ని ఒక కాగడా వెలుగులో బాగా పరీక్షించి చూసి, నివ్వెరపోతూ, దాన్ని శతభానుడి కిచ్చి, "మహారాజా! ఆ బాణం విడిచినవాడు కదంబరాజు ఉగ్రసేనుడు. దాని అలుగు మీద అతడి రాజచిహ్నమైన ఎలుగుబంటి తల వున్నది," అన్నాడు.

శతభానుడు బాణాన్ని పరీక్షించి చూసి, "మహామంత్రీ! దీని అర్థం ఏమిటి? ఉగ్రసేనుడు యుద్ధప్రకటన లేకుండానే మన మీదికి దండెత్తి వస్తున్నాడా? మన వేగులవాళ్ళు ఏం చేస్తున్నారు? సరిహద్దు కాపలావాళ్ళ మాటేమిటి?" అన్నాడు కోపంగా.

"మహారాజా, ఉగ్రసేనుడికి మన మీద బహిరంగంగా దండయాత్ర చేసే శక్తి సామర్థ్యాలు లేవు. అయినా మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది. సేనానికి చెప్పి, సైనిక సమీకరణా, రక్షణ ఏర్పాట్లూ చేయించండి," అన్నాడు గంగాధరుడు.

శతభానుడు సేవకుణ్ణొకణ్ణి పిలిచి, సేనా నాయకుణ్ణి పిలుచుకు రమ్మని ఆజ్ఞాపించి, భవనం కేసి బయలుదేరేంతలో, సైనికు డొకడు రొప్పుతూ రోస్తూ రాజు దగ్గిరికి వచ్చి, "మహారాజా! కదంబరాజు పంపగా వచ్చిన దూతలు నగరద్వారాల వద్ద వున్నారు. వాళ్ళను మీ దగ్గిరకు తెమ్మని సెలవా?" అని అడిగాడు.

"ఉగ్రసేనుడు మన వద్దకు దూతలను పంపటమా?" అంటూ శతభానుడు ఆశ్చర్యపోయాడు.

"దూత లెంతమంది? దర్పంగా కనిపిస్తు న్నారా?" అని ప్రశ్నించాడు గంగాధరుడు.

"అలాంటి దేమీ లేదు, ప్రభూ. వచ్చిన వాళ్ళంతా కలిసి ఆరుగురు. వాళ్ళల్లో ఇద్దరు పెడరెక్కలు విరిచి కట్టబడి వున్నారు. అందరూ ప్రాణాలరచేత పెట్టు కుని వున్న వాళ్ళలా కనిపిస్తున్నారు," అన్నాడు సైనికుడు.

"దీని వెనక ఏదైనా కుటిల రాజనీతి లేదు గదా, మహామంత్రీ? అరణ్యంలో ఏదో ఘోరం జరిగిపోయినట్టు నా కను మానం కలుగుతున్నది," అన్నాడు శత భానుడు తల పంకిస్తూ.

"ఉగ్రసేనుడు అందులో సమర్థుడే. ఏమైనా, ఈ దూతల ద్వారా అతడు పంపిన రాయబార మేమిటో తెలునుకోవటం అవ సరం గదా. దూతల వెంట పెడరెక్కలు విరిచి కట్టబడిన బందీ లేమిటి?" అంటూ గంగాధరుడు కొంచెం ఆగి సైనికుడితో, "వాళ్ళను సభామందిరానికి తీసుకురా," అని ఆజ్ఞాపించాడు. —(ఇంకావుంది)





# ఓర్చలేనివాడు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, అసూయాగ్రస్తులెవరైనా నిన్ని విధంగా శ్రమ పెట్టుతున్న పక్షంలో వాళ్ళు తామ్రకేతుడి లాగా నాశనం అవుతారు. నీవు గుణనిధి లాగా అన్ని ఆపదలూ గడిచి బయట పడ తావు. శ్రమ తెలియకుండా ఉండగలందు లకు నీకు వారి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

తూర్పుతీరాన గల ఒక రాజుకు ఒక కొడు కుండేవాడు. అతని పేరు తామ్ర కేతుడు. తామ్రకేతుడి వయసు గలవాడే మంత్రికి ఒక కొడుకుండేవాడు. అతని పేరు గుణనిధి. ఇద్దరూ ఒకే వయసు గలవా ళ్ళయినప్పటికీ బుద్ధులలో ఇద్దరికీ ఏమీ పోలిక లేదు. తామ్రకేతుడు నీచ బుద్ధులు

## బేతాళ కథలు



కలవాడు, గుణనిధి సజ్జనుడు. అందరికీ గుణనిధి అంటే చాలా ఇష్టం. అందుచేత అతనంటే శ్యామకేతుడికి తగని ఈర్ష్య. తాను రాజుకొడుకు గనక అతను గుణనిధికి వీలయినన్ని కష్టాలు తెచ్చిపెట్టుతూ, ఆ విధంగా కసి తీర్చుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు గుణనిధి తన గురువుగారితో సహా వనవిహారానికి వెళుతూండగా అతనికి దారిలో ఒక బంగారు ఈక కనిపించింది. అది తళతళా మెరుస్తూ ఉండటం చూసి గుణనిధి దాన్ని ఏరి తీసుకుని, "దీన్ని ఉంచుకోమంటారా, వద్దంటారా?" అని తన గురువు నడిగాడు.

"ఉంచుకున్నా విచారిస్తావు, మానినా విచారిస్తావు," అన్నా డతని గురువు.

"అలాటప్పుడు ఉంచుకోవటమే మంచిది," అంటూ గుణనిధి ఆ బంగారు ఈకను తన తురాయిలో అమర్చుకున్నాడు.

గుణనిధి వనవిహారం చేసి తిరిగి వచ్చే టప్పుడు రాజుకొడుకు అతని తురాయిలో మెరిసే ఈకను చూసి ఈర్ష్య చెంది, "నీ తురాయిలో ఏమిటది?" అని అడిగాడు.

"బంగారు ఈక! కావలిస్తే తీసుకో," అంటూ మంత్రికొడుకు ఈకను అతనికి ఇవ్వబోయాడు.

"ఈ ముష్టి ఈక ఎవడికి కావాలి? బంగారుపక్షినే తీసుకురా. ఒక నెలలో తీసుకురాకపోతే నీ తల తీయిస్తాను," అన్నాడు రాజుకొడుకు.

మంత్రికొడుక్కు ఆ పక్షి ఎక్కడ ఉండేదీ తెలీదు. బంగారుపక్షిని పట్టుకునే ఉపాయం అతని గురువే చెప్పాడు. రాజోద్యానంలో ఒక పెద్ద జలపాత్ర ఉన్నది. అందులో పక్షులు తాగటానికీ, స్నానం చెయ్యటానికి వీలుగా నీరుంటుంది. గురువుగారి సలహాతో మంత్రికొడుకు ఆ పాత్ర లోని నీరు తీసేయించి, దానిలో

సారా పోయించాడు. తరవాత అతను సమీపంలో ఉండే పొదలలో దాగాడు. తెల్లవారగానే పక్షులు గుంపులుగుంపులుగా ఆ పాత్ర వద్దకు రాసాగాయి. వాటన్నిటినీ మించిన శరవేగంతో ఒక బంగారుపక్షి, ఆకాశంలో సూర్యుడి లాగా ప్రకాశిస్తూ వచ్చి, పాత్ర అంచున వాలి, అందులోని సారా తాగింది. అది కడుపునిండా తాగగానే మంత్రికొడుకు చాటు నుంచి బయటికి వచ్చి, బంగారుపక్షిని పట్టుకుని, తీసుకు పోయి రాజుకొడుకు కిచ్చాడు. రాజుకొడుకు దాని కాళ్ళకు గొలుసు తగిలించి, గొలుసు చేత పట్టుకుని పక్షిని అటూ ఇటూ తిప్పాడు. ఆ పక్షి రాజుకొడుకు ఇష్టానుసారం నడవక, అతని పైకి వచ్చి, ముక్కుతో పొడిచి, రెక్కలతో బాదింది.

"ఈ పక్షికి నా మీద బాగా పగమప్పావు. ఈ సంగతి నేను మరిచిపోను," అన్నాడు రాజుకొడుకు మంత్రికొడుకుతో. మంత్రి కొడుకు మాట్లాడలేదు.

పక్షులకు రాణి అయిన దేవత ఒకతె ఉన్నది. బంగారుపక్షి పట్టుబడిన సంగతి ఆమెకు ఇతర పక్షుల ద్వారా తెలిసింది. ఆ దేవతకు పక్షు లన్నిటిలోకీ ఆ బంగారు పక్షి అంటే చాలా ఇష్టం. అందుచేత ఆమె



కోపోద్రేకంలో తన నడుముకున్న రత్నాభర ణాన్ని తీసి కోపంగా నేల మీద విసిరివేసి, తన భవనానికి వెళ్ళిపోయింది.

ఇది జరిగిన మర్నాడు మంత్రికొడుకు తన గురువుతో ఒక లోయకు వేటకు వెళ్ళాడు. అక్కడ ఒక చోట అతనికి నిగనిగా మెరిసే రత్నాభరణం కనిపించింది. మంత్రికొడుకు దాన్ని తీసుకుని చూసి, "ఇది నడుముకు పెట్టుకునే ఆభరణం. దీన్ని ఉంచుకోనా, మాననా?" అని గురువు నడిగాడు.

"ఉంచుకున్నా విచారిస్తావు, మానినా విచారిస్తావు," అన్నాడు గురువు.



"అ ఆభరణాన్ని ఏరుకున్నవాడివి, రెండో కంటివాడికి కనబడకుండా దాచి ఉంచవలిసింది. అప్పుడీ చిక్కు వచ్చేది కాదు. ఇప్పుడేం చేస్తావు? ఆ స్త్రీ కోసం వెతుకు," అన్నాడు మంత్రి.

మంత్రికొడుకు తన గుడువును వెంట బెట్టుకుని బయలుదేరాడు. ఎక్కడికి వెళ్ళాలో వాళ్ళకు తెలీదు. కాని అదృష్ట వశాన వాళ్ళు పక్షులరాణి ఉండే భవనానికే వచ్చారు. ఆమె నడుముకు పట్టీ లేక పోవటం చూసి, మంత్రికొడుకు చప్పున ఆమె పైన పడి, తన ఉత్తరీయాన్ని ఆమె మీద కప్పి, బలాత్కారంగా ఆమెను తెచ్చి తన గుర్రం మీద పెట్టి, తన దేశానికి తీసు కొచ్చాడు. పక్షులరాణి అరిచి కేకలు పెట్టినా ప్రయోజనం లేకపోయింది. పక్షులు అనే కంగా వచ్చి మంత్రికొడుకును పొడిచి అల్లరి చేయాలని యత్నించాయి గాని, అతని గురువు కొరడాతో వాటిని దగ్గిరికి రాకుండా తరిమికొట్టాడు.

పక్షులరాణి అందం చూసి రాజకుమా రుడు చాలా సంతోషించాడు.

"నీ అంత అందగత్తెను నే నెక్కడా చూడలేదు. మనం పెళ్ళి చేసుకుందాం," అన్నా డతను.

"ఉంచుకుంటాను. ఎందుకు విచా రించటం?" అంటూ అతనా ఆభరణాన్ని తన నడుముకు అమర్చుకున్నాడు.

"నీ నడుము కా పట్టీ ఎక్కడిది?" అని రాజుకొడుకు మంత్రికొడుకును చూసి అడిగాడు.

"వేటకు పోతే దొరికింది," అన్నాడు మంత్రికొడుకు.

"అది ఆడవాళ్ళు పెట్టుకునేది. ఇది పెట్టు కునే ఆడదాన్ని పట్టుకురా. నెలలోపల తీసుకురాకపోయావో నీ తల తీస్తాను," అన్నాడు రాజుకొడుకు. మంత్రికొడుకు వెళ్ళి సంగతంతా తన తండ్రితో చెప్పాడు.

"నన్ను పెళ్ళాడాలంటే నా కీ ఇక్కట్లు తెచ్చిపెట్టిన వాణ్ణి శిక్షించాలి," అన్నది పక్షులరాణి.

"తప్పకుండా శిక్షిద్దాం. ఏం శిక్ష విధిస్తావో చెప్పు," అన్నాడు రాజుకొడుకు.

"వాణ్ణి మరిగే నూనెలో పడెయ్యాలి," అన్నది రాణి. రాజుకొడుకు ఒక పెద్ద గంగాళంలో నూనె మరగబెట్టించి అందులో మంత్రి కొడుకును పడేయించాడు. కాని మంత్రి కొడుక్కు నూనె వేడిగా లేదు. జరిగిన దేమంటే, పక్షులరాణి నూనెగంగాళం కింద మంటలను చల్లబరుస్తూ ఉండమని తన అదృశ్యసేవకులను హెచ్చరించింది. వాళ్ళు అలాగే చేశారు. గంగాళంలో ఉన్న నూనె వేడెక్కనే లేదు. పక్షులరాణి సేవకులు దాన్ని కలియబెట్టుతూ ఉండటంచేత అది తెర్లుతున్నట్టు కనబడింది.

మంత్రికొడుకు చస్తాడని రాజుకొడుకు ఆశపడ్డాడు గాని, అలా జరగనందు కతను అటే బాధపడలేదు. అతను పక్షులరాణితో, "నీ కోరిక చెల్లించాను. ఇక మనం ఎప్పుడు పెళ్ళాడదాం?" అని అడిగాడు.

"నీకు నా మీద నిజంగా ప్రేమ ఉన్నదో లేదో పరీక్షించాలి," అన్న దామె.

"ఓ తప్పకుండా. నీ కోసమే గదా నా ప్రాణమిత్రుణ్ణి బలిచెయ్యటానికి సిద్ధ



పడ్డాను? ఇంకేం కావాలి, అది చాలదా?" అన్నాడు రాజుకొడుకు.

"చాలదు. నువ్వు కూడా ఈ నూనె గంగాళం లోకి దిగాలి," అన్నది పక్షులరాణి.

రాజుకొడుకు భయపడ్డాడు.

"మంత్రికొడుకు కిక్కురు మనకుండా చేసిన పని చెయ్యటానికి అంత భయపడతా వేమిటి? ఇంతేనా నీ ప్రేమ?" అన్నది పక్షులరాణి.

తప్పనిసరి అయి రాజుకొడుకు గంగాళంలో ప్రవేశించి అందులో మగ్గి చచ్చి పోయాడు. ఎందుచేతనంటే పక్షులరాణి సేవకులీసారి గంగాళం కింద బాగా మండనిచ్చారు.

రాజుకొడుకు చావగానే పక్షులరాణి తన బంగారుపక్షిని తీసుకుని తన భవనానికి వెళ్ళిపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. పక్షులరాణి మంత్రికొడుకు మీద పక్షపాతం చూపటాని కేమిటి కారణం? అతనే బంగారుపక్షిని పట్టుకున్నాడు, అతనే పక్షులరాణిని బలాత్కారంగా పట్టితెచ్చాడు. అలాటప్పు డామె అతన్ని ఎందుకు కాపాడింది? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పక్షులరాణి మంత్రికొడుక్కు శిక్షపడాలని ఎప్పుడూ కోరలేదు. రాజుకొడుకు ఆజ్ఞకు బద్ధుడై అతను ప్రవర్తించాడు. పక్షులరాణి కష్టాలన్నిటికీ అసలు కారకుడు రాజుకొడుకే. అతని శిక్షే ఆమె కోరింది. కాని మంత్రి కొడుకు మీది ఈర్ష్య కొద్దీ రాజుకొడుకు, ఆమె కోరేది మంత్రికొడుకు శిక్ష అనుకున్నాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాక్షసుడి పెంపుడు కొడుకు

ఒక రాజుకు ముగ్గురు కొడుకులు. ఒక ఉగాది పండగనాడు రాజూ, కొడుకులూ తలంట్లు పోసుకుని, కొత్తబట్టలు కట్టుకుని, వేపపువ్వూ, తేనే తిన్నాక, రాజు తన కొడుకులను, "నిన్న రాత్రి మీకేమేం కలలు వచ్చాయో చెప్పండి," అన్నాడు.

"నేను దోసిలి పట్టినట్టూ, అందులో గొప్ప నగరాలూ, పొలాలూ, మైదానాలూ, పశువుల మందలూ, మంచి భవనమూ, దాసదాసీలూ ఉన్నట్టూ నాకు కల వచ్చింది, నాన్నా," అన్నాడు పెద్దవాడు.

"భేషైన కల. దాన్ని నేను నిజం చేస్తాను," అంటూ రాజు తన పెద్ద కొడుక్కు గొప్ప జాగీరొకటి రాసి ఇచ్చాడు.

రెండో కొడుకది చూసి, "అన్నకు వచ్చిన కల లాటిదే నాకూ వచ్చింది, నాన్నా," అన్నాడు. రాజు వాడి క్కూడా ఒక జాగీరు రాసి ఇచ్చి, "నీ కేం కల వచ్చిందిరా?" అని మూడోవాడు ముకుందుణ్ణి అడిగాడు.

"నాకు అంత మంచి కల రాలేదులే, నాన్నా," అని ముకుందుడు తప్పించుకో జూచాడు. కాని రాజు పట్టుబట్టి ఆ కల ఏదో చెప్పమన్నాడు.

"మరేమీ లేదు. నేను చేతులు కడుక్కోవటానికి నువ్వు వెండిచెంబుతో నీళ్ళు పోసినట్టూ, అమ్మ నా చేతులను తువాలుతో తుడిచినట్టూ నాకు రాత్రి కల వచ్చింది," అన్నాడు ముకుందుడు.

"దుర్బుద్ధీ, నువు నా చేతా, మీ అమ్మ చేతా సేవలు చేయించుకునేపాటి వాడివా? పో ముందు నా రాజ్యం నుంచి. రేపీ పాటికి నా పొలిమేరలో కనిపించావంటే నీ తల తీయించేస్తాను," అని అరిచాడు రాజు.

రాజుకు కోపం వస్తే మనిషి కాడు. ఆ సంగతి ముకుందుడికి తెలుసు. అందు

సి. మాధవరావు



చేత వాడు కట్టుబట్టలతో అప్పుడే బయలు దేరాడు. వాడు నానా అగచాట్లూ పడి, ఆరు మాసాలు ప్రయాణం చేసి ఒక పెద్ద కోటను చేరుకున్నాడు. ఆ కోట ముఖ ద్వారానికి తలుపులు కూడా లేవు. ముకుం దుడు ఆవరణలోకి ప్రవేశించి, ఎవరైనా కని పిస్తారేమో, నౌకరీ అడుగుదామని చూస్తుం డగా ఒక పెద్ద రాక్షసుడు, ఒక చేత పెద్ద గంగాళం పట్టుకుని, వంద ఆవులను తోలు కుంటూ ఒక పక్క నుంచి ముందు ఆవ రణ లోకి వచ్చి, ఒక చోట గంగాళం ఉంచి, ఒక్కొక్క ఆవునే పాలు పితక సాగాడు. ఆ రాక్షసుడికి రెండు కళ్ళూ లేకపోవటం గమనించి ముకుందుడు నిర్ఘాంతపోయాడు. రాక్షసుడు గంగాళం నిండా పాలు పితికి, గంగాళం రెండు చేతులా ఎత్తి ఆ పాలన్నీ తాగేసి, ఆవులను ఒక కొట్టంలోకి తోలేసి, తలుపులు మూసి వచ్చి, తన ఇంటి చావడి లోకి వెళ్ళి ఒక పెద్ద బల్ల మీద చేరగిల బడి కూర్చున్నాడు.

ముకుందుడు మునివేళ్ళ మీద నడుచు కుంటూ రాక్షసుడి వెనకవైపు చేరి, "నాన్నా!" అని చిన్నగా అన్నాడు.

"ఎవరూ?" అన్నాడు రాక్షసుడు.

"నీ కొడుకును, నాన్నా," అన్నాడు ముకుందుడు.

"నాకు కొడుకు ఎప్పుడు పుట్టాడు?" అన్నాడు రాక్షసుడు ఆశ్చర్యంతో.

"ఇంతకు ముందే పుట్టాను, నాన్నా!" అన్నాడు ముకుందుడు.

"ఏదీ చూస్తాం, దగ్గిరికి రా!" అంటూ రాక్షసుడు చేతులు చాచాడు. ముకుందుడు నిర్భయంగా రాక్షసుణ్ణి సమీపించి, తన ఒళ్ళంతా తడవ నిచ్చాడు.

"చక్కగా ఉన్నావురా, బాబూ. నాకు కళ్ళు లేని కొరత తీరిస్తివా, నీకే లోపమూ రాకుండా చూసుకుంటాను," అన్నాడు రాక్షసుడు.

"నీకు అన్ని విధాలా సహాయం చేస్తాను, నాన్నా," అన్నాడు ముకుందుడు.

"నాకు పాలే ఆహారం. నీకు పాలతో తృప్తికలగదేమో. నీ ఇష్టం వచ్చినది తిన వచ్చు. చక్కగా భోజనం చేసి పుష్టిగా పెరుగు," అన్నాడు రాక్షసుడు.

మర్నాడు రాక్షసుడు అవులను మేపటా నికి బయటికి వెళ్ళినప్పుడు ముకుందుడు బూజుకర్రా, చీపురుకట్టా, అలుకుగుడ్డా తీసుకుని కోటలో ఉన్న గదులన్నీ శుభ్రం చేశాడు. ముప్పైరెండేళ్ళ క్రితం రాక్షసుడి కళ్ళు పోయాయి. అనాటి నుంచీ కోటను శుభ్రం చేసినవాళ్ళు లేరు.

కోటంతా శుభ్రం చెయ్యటం అయి పోయాక, ముకుందుడు ఒక గూట్లో దొరికిన పిల్లనగ్రోవి తీసుకుని, కిటికీ సమీపంలో నిలబడి దాని మీద ఏదో పాట వాయిం చాడు. వెంటనే బయట చెట్లూ, ఆకాశంలో మబ్బులూ, రాక్షసుడి కోటా—ఏదిబడితే అది—లయప్రకారం నృత్యం చెయ్య సాగాయి. ముకుందు డీ ప్రకృతి నృత్యాన్ని చూసి వినోదం చెందుతూ చాలాసేపు వాయించి, పాట ఆపేసి, పిల్లనగ్రోవిని తన బొడ్డులో దోపుకున్నాడు. పాట ఆగగానే ప్రకృతి నృత్యం కూడా ఆగిపోయింది.




సాయంకాలం కాగానే రాక్షసు డింటికి వచ్చి ముకుందుడితో, "అబ్బ ఏం నృత్యం! ఏం నృత్యం! కాళ్ళు పడిపోయాయిరా. అవులన్నీ నృత్యం చెయ్యటం వినిపించింది. నేనూ నృత్యం చేశాను. కాళ్ళ కింది భూమే నృత్యం చేసిందంటే నమ్ము!" అన్నాడు.

మర్నా డుదయం రాక్షసుడు అవులను మేపటానికి బయలుదేరేటప్పుడు ముకుం దుడు, "నీ కెందుకొచ్చిన శ్రమ, నాన్నా? నేను అవులను మేపుకొస్తాను. నువు హాయిగా ఇంట్లో కూచో," అన్నాడు.

"సరే, వెళ్ళిరా, బాబూ. అయితే, చూడూ! అవులను ఎటైనా తోలు, ఫరవా



లేదు. కాని ఆ దిబ్బకొండ మీద తెల్ల ఇల్లుంటుంది చూడూ, దాని మీదికి మాత్రం వెళ్ళకు. ఆ ఇంట్లో పిశాచిను లుంటారు. వాళ్ళ చేతులు పడిపోనూ! వాళ్ళే నా కళ్ళు కాజేశారు. ఆ పిశాచి ముండలు నీ కేదైనా అపకారం చెయ్యగలరు!" అని రాక్షసుడు హెచ్చరించాడు.

"జ్ఞాపకం ఉంచుకుంటానులే, నాన్నా," అని ముకుందుడు బయలుదేరాడు.

కోట దాటి కొంత దూరం వెళ్ళేసరికి, బోర్లించిన మూకుడు లాగా ఉన్న ఒక కొండా, దాని మీద ఎత్తుగా, ఏపుగా పెరిగి నవనవలాడుతున్న పచ్చికా, దూరంగా ఒక తెల్లని ఇల్లూ, దాని చుట్టూ ఎత్తయిన చెట్లూ కనిపించాయి. ముకుందుడు తన ఆవులను ఆ కొండ మీదికే తోలాడు. అవి అక్కడి గడ్డిని అవురావురని మెయ్యసాగాయి. ముకుందుడు ఎత్తయిన చెట్టొకటి ఎక్కి దాని మీద కూర్చున్నాడు.

కొంచెం సేపటికి తెల్లఇంటి కిటికీ వద్దకు ఒక పిశాచిని వచ్చి, చెట్టు మీద కూర్చున్న ముకుందుణ్ణి చూసి, "అక్కా, అక్కా! మెరిసే కళ్ళవా డొకడొచ్చాడు. త్వరగా రా!" అని కేకపెట్టింది. తరవాత ఇద్దరు పిశాచినులు ఇంటి నుంచి బయలుదేరి, ముకుందు డెక్కిన చెట్టు కిందికి వచ్చారు. వెంటనే ముకుందుడు బొడ్డు నుంచి పిల్లన గ్రోవిని తీసి పాట వాయించసాగాడు. వెంటనే మళ్ళీ ప్రకృతినృత్యం ఆరంభ మయింది. పిశాచినులు నృత్యం చేశారు, చెట్లూ, ఆవులూ, చివరకు కొండ కూడా నృత్యం చేసింది. నృత్యం చేస్తున్నట్టే చేస్తూ ఒక పిశాచిని ముకుందు డున్న ఎత్తుకు ఎగిరింది. వెంటనే వాడు దాని జుట్టు పట్టు కుని, ఒక కొమ్మకు ముడేసి, పిశాచినిని వేళ్ళాడదీశాడు. ఇంతలోనే రెండో పిశాచిని కూడా ఎగిరింది, దాన్ని కూడా ముకుందుడు ఇంకో కొమ్మకు వేళ్ళాడదీశాడు.



"మమ్మల్ని విడిచిపెట్టు, నువ్వేం కోరితే అది చేస్తాం," అన్నారు పిశాచినులు.

"మా నాన్న కళ్ళు తిరిగి ఇచ్చెయ్యండి," అన్నాడు ముకుందుడు.

"మమ్మల్ని దిగి వెళ్ళనిస్తే క్షణంలో తెచ్చి ఇస్తాం," అన్నారు పిశాచినులు.

"అదేమీ కుదరదు. మా నాన్న కళ్ళు ఎక్కడున్నాయో చెబితే నేను వెళ్ళి తెచ్చుకుని, మా నాన్నకిచ్చి, ఆయనకు చూపు వచ్చాకనే మిమ్మల్ని వదులుతాను. అంత దాకా మీరిలా వేళ్ళాడవలిసిందే," అన్నాడు ముకుందుడు.

"వంట ఇంట్లో పెద్ద పొయ్యికి ఎగువన ఎత్తుగూట్లో ఒక చిన్న పెట్టెలో రెండు పళ్ళుంటాయి. పెద్ద పొయ్యి పక్కన రెండు బుల్లిరాకాసులుంటాయి. వాటిని చూసి, 'బౌ, బౌ' అనేవు, అవి దడుచుకుంటాయి. వాటిని 'దూ, దూ' అని దగ్గిరికి పిలిచి, చేతుల్లోకి తీసుకుని ముద్దు చేస్తివా, అవి గూట్లో ఉన్న పళ్ళు తీసి నీ కిస్తాయి. ఆ పళ్ళను మీ నాన్న తింటే కళ్ళొస్తాయి," అన్నారు పిశాచినులు.

ముకుందుడు వాళ్ళ ఇంటికి వెళ్ళి వంటిల్లు ప్రవేశిస్తూనే పెద్ద పొయ్యి పక్కన ముడుచుకుని కూర్చున్న రాకాసిపిల్లలను చూశాడు. వాటి గోళ్ళూ, వాలకమూ చూస్తే వాడికి పిశాచినులు చెప్పినట్టు చెయ్య బుద్ధి పుట్టలేదు. వాళ్ళు తన కళ్ళు పీకించటానికే ఆ రాకాసులను ఎత్తుకుని ముద్దు చెయ్యమన్నారని వాడికి తోచింది. అందుచేత ముకుందుడు వాటిని చూసి, భయంకరంగా "బౌ, బౌ" అని అరిచాడు. అవి రెండూ దడుచుకుని పొయి మంటలోకి దూకి మాడి చచ్చిపోయాయి.

తరవాత ముకుందుడు ఎత్తు పీట ఒకటి తెచ్చి, ఎగువ గూట్లో ఉన్న పెట్టె తీసి, అందులో నుంచి రెండు పచ్చని పళ్ళు తీసుకుని, పిశాచినులు కేకపెడుతున్నా వివి



నీ కోసం పళ్ళు తెచ్చాను, తింటావా ఏమిటి?" అన్నాడు.

"నాకు పాలు తప్ప ఇంకేవీ అలవాటు లేదురా," అన్నాడు రాక్షసుడు.

"అలాకాదు. ఈ పళ్ళు తినిచూడు. వీటి రుచి అద్భుతం," అంటూ ముకుందుడు రెండు పళ్ళూ రాక్షసుడికి అందించాడు. రాక్షసుడు ఒక పండు నోట వేసుకుని నములుతూ, "ఒరేయ్, నా కుడి కన్నుకు చూపొచ్చిందిరోయ్!" అని ఆవేశంతో అరిచాడు.

"రెండో పండు కూడా తిను," అన్నాడు ముకుందుడు.

రెండో పండు కూడా తిని రాక్షసుడు, "నాకు చూపొచ్చింది! నా కన్నీ కనిపిస్తున్నాయి! నాకు చూపొచ్చింది!" అని అరుస్తూ గంతులు వేశాడు; ముకుందుణ్ణి కౌగలించుకుని, "నా చిట్టి తండ్రి! నాకు కళ్ళిచ్చాడు!" అంటూ అతణ్ణి ముద్దు పెట్టుకున్నాడు.

రాక్షసుడి ఉద్రేకం కాస్త తగ్గాక ముకుందుడు దిబ్బకొండ మీది పిశాచినుల విషయమంతా చెప్పాడు.

వెంటనే రాక్షసుడు రెండు పెద్దదివిటీలు పట్టుకుని వెళ్ళి, ఇంకా చెట్టుకు వేళ్ళాడు

పించుకోకుండా, తన ఆవులను తోలుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం రాక్షసుడు పాలు పితుకుతూ, "ఇవాళ ఆవులు రెండింతలు పాలు చేపుతున్నాయేమిట్రా, నాయనా?" అన్నాడు సంతోషంగా.

"నీకు కళ్ళు లేవు గనక మంచి గడ్డి ఎక్కడుందో తెలీదు. నే నివాళ ఆవులకు చాలా మంచి గడ్డి మేపాను," అన్నాడు ముకుందుడు.

రాక్షసుడా రోజు రెండు గంగాళాల పాలు తాగి తన బల్ల మీద కూర్చున్నాడు. ముకుందుడు రాక్షసుడి దగ్గిరచేరి, "నాన్నా,

తున్న పిశాచినుల నిద్దరినీ కాల్చి బూడిద చేసి తిరిగి వచ్చాడు. ఇంటికి తిరిగి వస్తూనే అతను పెద్ద తాళపు చెవుల గుత్తి తీసి ముకుందుడి కిచ్చి, "బాబూ, ఈ కోటలో ఉండే గదుల తాళపు చెవులన్నీ ఇందులో ఉన్నాయి. వాటిలోని రత్నాలూ, బంగారమూ అంతా నీదే. నేను చచ్చేదాకా నువు వేచి ఉంతటం అనవసరం. నేనిప్పు డప్పుడే చావను, నాది వెయ్యేళ్ళ ఆయుస్సు. అందు చేత ఇప్పుడే గదులన్నీ తెరిచి, ఏ గదిలో ఏమున్నదీ చూసి, నీకు కావలిసిన దంతా తీసుకుని, హాయిగా అనుభవించు," అని చెప్పాడు.



ముకుందుడు గుత్తిలో ఉన్న ముప్పై తొమ్మిది తాళపు చెవులతోనూ ముప్పై తొమ్మిది గదులు తెరిచి, వాటిలో ఉండే రత్నరాసులూ, వెండి బంగారాల గుట్టలూ చూసి ఆశ్చర్యపడ్డాడు. ప్రపంచమంతా గాలించినా అంత ధనం ఉంటుందని వా డనుకోలేదు. వాడికా నిధులు నిరుపయోగమనిపించాయి. ఒక మంచి కెంపూ, ఒక వజ్రమూ, వెండి పోగులతో నేసి, ముత్యాలకూర్పు చేసిన ఒక చొక్కా, వెండి పాదరక్షలూ తీసి వాటిని ధరించాడు. తరవాత ఒక రత్నాల పిడి గల ఖడ్గమూ, బంగారు పోగులతో తయారు చేసిన అంగీ తీసుకున్నాడు. ఆ అంగీని ధరిస్తే ఏమాత్రమూ బరువుగాలేదు, కాని అది దుర్భేద్యమైన కవచం. దాన్ని లోకంలో ఏ ఖడ్గమూ ఛేదించలేదు.

ఇవన్నీ తీసుకుని ముకుందుడు రాక్షసుడి వద్దకు తిరిగి వస్తుండగా వాడికి నలభయ్యో గది కనిపించింది. దాని తాళం తుప్పుపట్టి ఉన్నది. గుత్తిలో ఉన్న ఏ తాళపుచెవీ ఆ తాళానికి పట్టలేదు. అందుచేత వాడు రాక్షసుడి వద్దకు తిరిగి వచ్చి, "నాన్నా, ఈ తాళపుచెవుల గుత్తిలో తుప్పు తాళం తీసేది కనబడదేం?" అని అడిగాడు.



"ఆ తాళంచెవి పోయింది. అయినా ఆ గదిలో చెత్తా చెదారమూ తప్ప ఇంకేమీ లేదు," అన్నాడు రాక్షసుడు.

"అబద్ధమాడుతున్నావు. ఆ గదిలో ఏమున్నదో నేను చూడటం నీ కిష్టంలేదు," అన్నాడు ముకుందుడు.

రాక్షసుడు పెద్దగా నిట్టూర్చి, "నాయనా, నిన్నా గదిలోకి పోనిస్తే నువు మరి నాకు దక్కవు," అన్నాడు.

"నా కేమైనా అపాయం కలుగుతుందా?" అని ముకుందు డడిగాడు.

"నీ కేమీ అపాయం రాదు, కాని నాకు తీరని నష్టం వస్తుంది," అన్నాడు రాక్షసుడు, కంటి వెంట గాజుబుడగలంతేసి అశ్రువులు కారుస్తూ.

"నీ కేమీ నష్టం రానివ్వను. నా మాట నమ్ము," అన్నాడు ముకుందుడు.

రాక్షసుడు తన చెవి నుంచి పాత తాళపుచెవి ఒకటి తీసి ముకుందుడి కిస్తూ, "నాయనా, నువ్వెక్కడ ఉన్నప్పటికీ నన్ను మాత్రం మరిచిపోకు," అన్నాడు.

"నే నెక్కడికీ పోను, నాన్నా. నువు కంట తడిపెట్టకు," అంటూ ముకుందుడు తాళపుచెవి తీసుకుని నలభయ్యో గదికి వెళ్ళి, తుప్పుతాళం తెరిచి, లోపల ప్రవేశించి, నిర్ఘాంతపోయి నిలిబడ్డాడు.

ఆ గదిలో ఒక దేవతాశ్వం లాంటిది ఉన్నది. ప్రయాణానికి సిద్ధంగా దాని మీద బంగారు జీను వేసి ఉన్నది. దాని శరీరం వెండి లాగా మెరుస్తున్నది, జూలు బంగారం రంగులో ధగధగ లాడుతున్నది.

"ఇప్పటికి వచ్చావా, రాజకుమారా! మనం శీఘ్రంగా వెళ్ళాలి. అక్కడ నీ తండ్రి ఒక మూర్ఖపు పని చేసి తన ప్రాణం మీదికి తెచ్చుకున్నాడు. వెంటనే వెళ్ళాలి," అన్నదా గుర్రం ముకుందుడితో.

గుర్రం ఉండిన గదికి బయటివాకిలి ఉన్నది. దాన్ని తెరిచి ముకుందుడు

గుర్రాన్ని బయటికి తెచ్చి, దాని పైన ఎక్కాడు. వెంటనే ఆ గుర్రం రెక్కలున్నట్టుగా రివ్వున ఆకాశంలోకి లేచి, శర వేగంతో ముకుందుడి తండ్రి నగరం కేసి బయలుదేరింది.

"ఏం జరిగింది? మా తండ్రి ఏం చేశాడు?" అని అడిగాడు ముకుందుడు.

"నీ చెల్లెలికి పెళ్ళి చెయ్యాలని నిశ్చయించి, మీ రాజభవనానికి కొంత దూరాన ఉన్న ఊబిమడుగును గుర్రం మీద దూకిన వాడికి నీ చెల్లెలి నిచ్చి చేస్తానని చాటింపు వేయించాడు నీ తండ్రి. ఎంద రెందరో రాజకుమారులు వచ్చి ఆ ఊబిమడుగును లంఘించటానికి ప్రయత్నించి, ఊబిలో పడి చచ్చిపోయారు. నిజానికి ఏ గుర్రమూ అంత పెద్ద ఊబిని లంఘించలేదు. రాజులందరూ ఆగ్రహించి, ఒక్క ఉమ్మడిగా నీ తండ్రి పైకి దండెత్తి వచ్చారు. నువు వెళ్ళి కాపాడకపోతే ఆయన సమూలంగా నాశన మవుతాడు," అని గుర్రం చెప్పింది.

ముకుందుడు ఆరుమాసాలు ప్రయాణించిన దూరాన్ని గుర్రం ఆరు గంటలలో దాటింది. ముకుందుడు చేరేసరికి వాళ్ళ కోటను శత్రుసేనలు ముట్టడించి ఉన్నాయి. ముకుందుడు దివ్యమైన తన గుర్రాన్నీ,



ఖడ్గాన్నీ, కవచాన్నీ నమ్ముకుని అంత సేన మీదికి ఒంటరిగా వెళ్ళాడు. త్వరలోనే శత్రుసేనలు చిందరవందర అయాయి. ముకుందుడు తమను ఊచకోత కోసేస్తుంటే శత్రువు లతనికి చిన్న గాయం కూడా కలిగించలేక పోయారు. గుర్రం యొక్క అద్భుతశక్తుల మూలంగా శత్రువు లతన్ని కనీసం పట్టుకోనైనా పట్టుకోలేకపోయారు.

సూర్యాస్తమయం అయే లోపునే యుద్ధం పూర్తి అయింది. శత్రువులలో మిగిలినవారు పారిపోయారు. ఇదంతా కోటగోడల మీది నుంచి చూస్తూ ఉండిన రాజభటులు రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, ఆపద గడి

చింది. స్వర్గం నుంచి ఇంద్రుడో ఎవరో దిగి వచ్చి మన శత్రువు లందరినీ పార దోలేశాడు," అని చెప్పారు.

రాజు పరమానందభరితుడై తన పరివారాన్ని వెంటబెట్టుకుని మేళతాళాలతో ఎదురు వచ్చి, యుద్ధరంగంలో విశ్రాంతి తీసుకుంటున్న ముకుందుణ్ణి సమీపించి, తన వెంట వచ్చి తన ఆతిథ్యం స్వీకరించమని ప్రార్థించాడు. ఆయన తన మూడో కొడుకును గుర్తించనేలేదు.

ముకుందుడు రాజభవనానికి వచ్చేసరికి బ్రహ్మాండమైన విందు ఏర్పాటై ఉంది.

"మనం భోజనా లయాక సావకాశంగా ముచ్చటించుకుందాం," అన్నాడు రాజు.

"నాకూ ఆకలిగానే ఉన్నది. చేతులు కడుక్కుని భోజనం చేస్తాను," అన్నాడు ముకుందుడు. రాజు గబగబా వెళ్ళి వెండి చెంబుతో తెచ్చి ముకుందుడి చేతి మీద నీళ్ళు పోస్తుంటే రాణి అతని చేతులకు దిగువగా ఒక బంగారు పళ్ళెం పెట్టి, చేతులు కడుక్కోవటం పూర్తి కాగానే తువాలుతో తుడిచింది.

ముకుందుడు రాజు కేసి తిరిగి చిరునవ్వు నవ్వి, "అయితే, నా కల బొత్తిగా అబద్ధం కాదన్నమాట!" అన్నాడు.

వెంటనే రాజూ, రాణీ తమ కొడుకును గుర్తించారు. రాజు తన కొడుక్కు మరీ మరీ క్షమాపణలు చెప్పుకున్నాడు. ఆ విందులోనే ఆయన తన సింహాసనానికి వారసుడు తన మూడో కొడుకేననీ, తన పెద్దకొడుకు లిద్దరూ యుద్ధంలో తనకు సహాయమైనా రాకపోగా, నానా మాటలూ అంటూ కబురు చేశారనీ అందరికీ తెలియబరిచాడు.

ముకుందుడు రాక్షసుణ్ణి మరవలేదు. నెలకొక రోజు అతను తన గుర్రం మీద రాక్షసుడి కోటకు వెళ్ళి, ఒక రోజల్లా అక్కడ ఉంటూ వచ్చాడు.





# చెయ్యి చాచిన దాత

ఒకసారి పాపన్న తమ గ్రామాధికారి తరఫున కొన్ని వస్తువులను పొరుగూరి జమీందారుకు అందజేయవలసి వచ్చింది. పాపన్న లాటి నమ్మకస్తుడు మరొకడు దొరకనందువల్ల గ్రామాధికారి ఆ పని పాపన్నకే అంటగట్టాడు.

పాపన్న జమీందారుగారి ఊరు చేరుకుని, జమీందారుగారింటికి పోతూండగా, దారి పక్కన ఉన్న గుడిసెలో నుంచి శోకాలు వినిపించాయి. ఈ ఏడుపుల మధ్య ఒక ఆడది, "జోస్యంవైద్యుడు చెప్పిన మాట పొల్లుపోతుందా? నువు పోతే మా కింకెవరు దిక్కు? ఇక్కడ ఉండనివ్వరు. ఎక్కడికని పోతాం? దిక్కులేని పక్షులకు ఎవరు సాయం చేస్తారు? ఎంత కష్టం తెచ్చిపెట్టావురా, దేవుడా!" అంటూ ఏడుస్తున్నది.

ఒక మగగొంతు, "నే నింకా చావకుండానే చచ్చినంతగా ఏడుస్తున్నా వేమే? నన్ను నెమ్మదిగా చావనివ్వవా ఏం? ఏమిటీ గోల?" అన్నది బలహీనంగా.

ఈ వింత సంభాషణ ఆలకించిన పాపన్న గుడిసెలో ప్రవేశించాడు. లోపల తల విరబోసుకున్న ఒక ఆడదీ, నలుగురు పిల్లలూ ఉన్నారు. అందరూ ఏడుస్తున్నారు. చాప మీద చింకిపాత ఒకటి కప్పుకుని ఒక మగవాడు రోగంతో వణుకుతున్నాడు.

పాపన్న వాళ్ళను చూసి, "ఎందు కలా కంగారు పడతారు? ఏమిటి మీకు వచ్చిన కష్టం? నాతో చెప్పండి, చేతనైన సహాయం చేస్తాను," అన్నాడు. అసలే చలికాలం, అందులోనూ రోగిష్టివాడు. అతనికి కప్పుకునేటందు కొక పాతకంబళీ కూడా లేకపోవటం చూసి పాపన్న తన మీద ఉన్న శాలువా తీసి రోగికి కప్పాడు.

రోగి భార్య తమ పరిస్థితి అంతా పాపన్నకు చెప్పింది. రోగి పేరు రాములు.




జమీందా రింట్లో పని చేస్తాడు. వాళ్ళుం
టున్న గుడిసె కూడా జమీందారు స్థలం
లోనే ఉంది. జమీందా రింట చాకిరీ చేసి
తెచ్చే కొద్దిపాటి జీతంతో కుటుంబం ఎలాగో
గడుస్తున్నది. జమీందారు దగ్గిర నౌకరీ చేసే
వాళ్ళకు జబ్బు చేస్తే జమీందారే వైద్యం
చేయిస్తాడు. పనివాళ్ళు తామే డబ్బిచ్చి
వైద్యం చేసుకుంటే జమీందారుకు అవ
మానం. అదీగాక, జమీందారు దగ్గిర పని
చేసేవాళ్ళ వద్ద వైద్యం ఖర్చుకు డబ్బు
ఉండనూ ఉండదు.

ఈ మధ్యనే రాములుకు జ్వరం తగల
నారంభించింది. అతని భార్య వెళ్ళి
ఆ సంగతి జమీందారుతో చెప్పుకున్నది.
ఆ ప్రాంతాల బాగా పేరుమోసిన జోస్యం
వైద్యుణ్ణి జమీందారు రాములు చికిత్స
కోసం పిలిపించాడు.

జోస్యం వైద్యుడు వైద్యం లోనూ,
జ్యోతిషం లోనూ కూడా గట్టివాడు. ఎవ
రైనా జబ్బుపడి ఆయనను పిలిచినప్పుడు
ఆ వైద్యుడు ముందు జోస్యం చూసి, రోగికి
నయమయే యోగం ఉన్నట్టు తోస్తేనే
మందిస్తాడు. లేకపోతే, "ఇది నయమయే
వ్యాధి కాదు. మందివ్వమంటే ఇస్తాను,"
అంటాడు. తాను చికిత్స చేసే రోగి చని
పోతే తనకు అపఖ్యాతి అని ఆ వైద్యుడి
భయం. కొన్ని సందర్భాలలో ఆయన
అన్నట్టే జరగటం చేత అందరికీ ఆయన
జోస్యంలో కూడా మంచి గురి ఉన్నది.
ఆయనను అందరూ జోస్యంవైద్యు డనే
వారు. కొంతమంది మటుకు ఆయన చేత
వైద్యం చేయించుకోవట మంటే హడలి
పోయేవారు.

అలవాటు ప్రకారం జోస్యంవైద్యుడు
ముందుగా రాములు జాతకచక్రం వేసి
చూసి, మీనమేషాలు గుణించి, పెదవివిరిచి,
"లాభం లేదు. దక్కడు. ఇప్పుడు వాడికి
కుజరాహు సంధి. శాంతి చేసినా ఫలితం

ఉండకపోవచ్చు. మందివ్వమంటే ఇస్తాను," అని జమీందారుతో అన్నాడు.

"మందిచ్చి ప్రయోజనం లేనప్పుడు దేనికి? కుజరాహు సంధి దోషపరిహార కర్మంటే మాటలా? శ్రీమంతులకే ఎంతో ఖర్చుతో కూడిన పని. అది వాడి వల్ల ఏ మవుతుందీ? ఇక మీరు వెళ్ళండి," అని జమీందారు జోస్యంవైద్యుణ్ణి పంపే శాడు. తరవాత ఆయన రాములు భార్యతో, "విన్నావుగా? ఈ వైద్యుడి మాటకు తిరుగు లేదు. కాలం తీరిన వాడికి వైద్యం కూడా దేనికి? నువు మాత్రం ఇల్లు దాటి ఎటూ వెళ్ళక, ఈ నాలుగు రోజులూ రాముల్ని కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండు," అన్నాడు. అందుకే ఈ ఏడుపులూ, పెడ బొబ్బలూనూ.

సంగతంతా విని పావన్న రాములు భార్యతో, "జమీందారు నడిగి ఒక మంచమూ, కంబళీ అయినా తెచ్చుకో పోయావా? రోగిష్ఠి మనిషి తడినేల మీద పడుకోవచ్చా? ఈ మనిషికి వైద్యమూ గ్రహశాంతీ కూడా జరిగి తీరాలిసిందే. మనిషి చస్తున్నాడని తెలిసినా ఆఖరు క్షణంలో కూడా ఏ గరళమో పోస్తారు గాని, విడిచిపెట్టేస్తారా? వైద్యుణ్ణి తీసుకొద్దాం, పద," అన్నాడు.





కాని రాములు భార్య పాపన్న వెంట వెళ్ళి, జమీందారును మంచం ఇవ్వమనీ, కంబళీ ఇవ్వమనీ, వైద్యం చేయించమనీ అడగటానికి చాలా భయపడింది.

"నువేమీ భయపడకు. జమీందారుకు నేను చెబుతాలే. నేనూ ఒక జమీందారునే," అని పాపన్న రాములు భార్యను బయలు దేర దీసి, జోస్యంవైద్యు డింటికి వెళ్ళాడు.

ఎవరో కొత్త రోగికి చికిత్స కోసం వచ్చా రనుకుని వైద్యుడు, రోగి పేరూ, జన్మ నక్షత్రమూ, తిథి వారాలూ అడిగాడు.

"ఈ మనిషి జాతకం మీరు ముందే చూశారు. ముందు వైద్యం చెయ్యండి, ఆ తరవాత కుజరాహు సంధి దోషానికి శాంతి కూడా మీరే చేద్దురుగాని. వాట న్నిటికీ ఖర్చెంత అవుతుందో చెప్పండి," అన్నాడు పాపన్న.

"అంతా చేరి యాభై, అరవై రూపా యల దాకా అవుతుంది," అన్నాడు వైద్యుడు. ఆయన వచ్చి రాములును చూసి మందిచ్చి, అనుపానాలూ అవీ చెప్పాడు.

"నేను మళ్ళీ తమ దర్శనం చేసుకుని అంతా మాట్లాడతాను," అని వైద్యుణ్ణి పంపేసి, త్వరలోనే తిరిగి వస్తానని గుడిసె వాళ్ళతో చెప్పి, పాపన్న జమీందా రింటికి బయలుదేరాడు.

జమీందా రింటికి కొద్ది దూరంలో దారి పక్కన మామిడిచెట్టు మీద ఎక్కి కాయ కోస్తున్న కుర్రవా డొకడు కెవ్వున అరుస్తూ కింద పడ్డాడు. పాపన్న చప్పున వాణ్ణి సమీ పించి చూశాడు. కుర్రాడు పది, పన్నెండేళ్ళ వాడు. వాడికి అక్కడక్కడా గాయాలు తగిలాయి. స్పృహ తప్పిపోయింది.

పాపన్న ఆ కుర్రవాణ్ణి ఎత్తుకుని గబగబా జోస్యంవైద్యు డింటికి వెళ్ళి, "అయ్యా, ఈ కుర్రవాడు చెట్టు మీది నుంచి పడి గాయపడ్డాడు. స్పృహ లేదు. చికిత్స చెయ్యండి," అన్నాడు.

"పడింది సరిగా ఏ వేళకు? వాడి పేరేమిటి? జన్మనక్షత్రం?" అని వైద్యుడు ప్రారంభించాడు.

"నా కవేమీ తెలీవు. జోస్యం తరవాత చూసుకోవచ్చు. ముందు చికిత్స చెయ్యండి," అన్నాడు పాపన్న తీవ్రంగా.

వైద్యుడు పాపన్న దగ్గిరికి వచ్చి, అతని చేతుల్లో ఉన్న పిల్లవాణ్ణి చూసి, "వీడేనా? వీడు మన జమీందారుగా రబ్బాయేనండీ. అలా పడుకోబెట్టండి. కట్లు కట్టి మందిస్తాను. కించిత్తు గ్రహదోషం ఉండి ఉంటుంది. జమీందారుగారితో చెప్పి గ్రహశాంతి కూడా తరవాత చేయింతాం," అంటూ కుర్రవాడికి మందిచ్చి స్మృతి కలిగించి, గాయాలకు మందులు రాచి కట్టు కట్టాడు.

తరవాత పాపన్న కుర్రవాణ్ణి జమీందారు గారింటికి చేర్చి, తాను వచ్చిన పని పూర్తి చేసి, కుర్రవాడి పాటు గురించీ, చికిత్స గురించీ చెప్పి, "నాకు వేరే తొందర పని ఉన్నది. నా కిక సెలవిప్పిస్తారా?" అన్నాడు.

జమీందారు పాపన్నను పొగడాడు. సమయానికి అదుకోకపోతే, చెట్టు పై నుంచి పడి స్పృహ తప్పిన తన కొడుకేమై ఉండును?

"మీరు నాకు చేసిన మహోపకారానికి నా దగ్గిర ఏదైనా పుచ్చుకు తీరాలి.



మీ ఋణం ఉంచుకోవటం నాకు సాధ్యం కాదు. మీ మనస్సుకు నచ్చినది అడిగి మరీ పుచ్చుకోండి," అన్నాడు జమీందారు.

పాపన్న కొంచెం ఆలోచించి, "అలా అయితే నాకు రెండు కంబళ్ళూ, ఓ వంద రూపాయలూ ఇప్పించండి," అన్నాడు, చెయ్యి చాచి.

పాపన్న ఏమీ తీసుకోడనుకుంటున్న జమీందారుకు, అతను చెయ్యి చాచి అడగటం చూసి అమిత ఆశ్చర్యం కలిగింది. కాని అన్న మాట తప్పటానికి లేదు. అందుచేత జమీందారు రెండు కొత్త కంబళీలూ, వందరూపాయలూ తెప్పించి, పాపన్న కిచ్చి, అతన్ని పంపేశాడు.

పాపన్న అవి తీసుకుని తిన్నగా రాములింటికి వెళ్ళి, కంబళీలను రాములు భార్య కిచ్చాడు. ఆమెకే అయిదురూపాయలు కూడా ఇచ్చి, మంచం ఒకటి కొనుక్కు రమ్మని పంపి, పాపన్న జోస్యంవైద్యుడింటికి వెళ్ళి, శాంతి ఖర్చుల కింద యాభై రూపాయలు ఆయన చేతిలో పెట్టి, గుడిసెకు తిరిగి వచ్చి, తన దగ్గిర ఇంకా మిగిలి ఉన్న డబ్బు ఖర్చులకు వాడుకోమని రాములు భార్యచేతి కిచ్చి, తాను తన ఊరికి తిరిగి వెళ్ళిపోయాడు.

తన వద్ద తీసుకున్న దానాన్ని పాపన్న ఎలా వినియోగించాడో తెలియవచ్చే సరికి జమీందారుకు తల తీసేసి నట్టయింది. ఆయన తన పరువు నిలబెట్టుకోవటానికై రాములు గుడిసెకు వచ్చి, "ఏమిట్రా ఇదంతా? మీ కేం కావలిస్తే అదంతా ఇవ్వటానికి నేను లేనూ? పారుగూరి పాపన్న సహాయం దేనికి?" అంటూ తానే పాపన్న ద్వారా వారికి సహాయం చేసినట్టుగా నటించి, తన కొడుకు కోసమూ, రాములు కోసమూ కూడా జోస్యంవైద్యుడి చేత గ్రహశాంతి చేయించాడు. అప్పటికే రాములు వ్యాధి నిమ్మళించి అతను తేరుకున్నాడు.






# పట్టినది బంగారం

ఒక వర్తకుడి కొక కొడుకుండేవాడు. వర్తకుడికి భార్య చిన్నతనం లోనే పోయింది. అందుచేత ఆయన కొడుకును చాలా గారాబంగా పెంచి, వాడి కోసం బంగారాన్ని రెండు చేతులా ఆర్జించి, వాడి సుఖం కోసం దాన్ని మంచినీటి లాగా ఖర్చు చేస్తూ వచ్చాడు. తన కొడుకు సుఖం తప్ప ఆ మానవుడికి మరొక ఆలోచనే ఉండేది కాదు.

కొంత కాలానికి వర్తకుడు మంచాన పడ్డాడు. చావు దగ్గిర పడినట్టు తెలుసుకుని ఆయన తన కొడుకును పిలిచి, "బాబూ, నువు మట్టి పట్టితే అది బంగారం కావాలని నా ఆఖరు ఘడియలో నిన్ను మనస్ఫూర్తిగా దీవిస్తున్నాను," అంటూ ప్రాణాలు వదిలాడు.

వర్తకుడి కొడుకు తండ్రి కోసం కొన్ని వారాలపాటు శోకించి, ఆ శోకం ఉపశమించాక, తండ్రి లాగే వర్తకం లోకి దిగాడు. తండ్రికి లాగే కొడుక్కు కూడా వ్యాపారం అమితంగా కలిసివచ్చి, కనకవర్షం కురిసింది.

కొంతకాలం ఇలా ఎడాపెడా ధనం సంపాదించాక కుర్రవాడికి తన తండ్రి చేసిన ఆఖరు ఆశీర్వచనం జ్ఞాపకం వచ్చింది. ఆయన నోటి చలవ చేతనే తన కిలా పద్దంటే డబ్బు వచ్చిపడుతున్న దనుకుని, "అదృష్టం ఇలా కలిసిరావటం అపాయకరం. దీనికి ఏదన్నా విరుగుడు చూడాలి," అనుకున్నాడు వాడు.

తన అదృష్టానికి కళ్ళెం వేసే ఉద్దేశంతో వాడు వర్తకపు సరుకులను హెచ్చు ధర ఉండే ప్రాంతంలో కొని, తక్కువ ధర ఉండే ప్రాంతంలో అమ్మటానికి నిశ్చయించాడు. ఆ ఉద్దేశంతో వాడు చాలా గిరాకీగా ఉండే చోట ఖర్జూరాలు కొని, వాటిని ఈజిప్టు దేశంలో అమ్మటానికి తీసుకుపోయాడు. ఆ దేశంలో ఖర్జూరాలు కారుచవుక.

ఏ. వెంకటేశ్వరరావు

ఎవడో వర్తకుడు ఎక్కడి నుంచో ఖర్జూ రాలు తెచ్చి తన దేశంలో అమ్ముతున్నట్టు ఈజిప్టు రాజుకు తెలిసింది. అయన తన ఉద్యోగులతో, "ఎవరీ వింత వర్తకుడు?" అన్నాడు. రాజోద్యోగులు రాజును కుర్రవాడి వద్దకు తీసుకుపోయారు.

"ఈ మతిలేని వ్యాపారం చేసి ఉన్న దంతా ఎందుకు తగలేసుకుంటున్నావు?" అని రాజు యువకుణ్ణి అడిగాడు.

"మహారాజా, మా నాన్న ఆశీర్వాదం చేత నేను ఎంత నిర్లక్ష్యంగా వర్తకం చేసినా కనకవర్షం కురుస్తున్నది. అదృష్టం అంతగా కలిసిరావటం మంచిది కాదని దానికి విఘ్నం కలిగించే ప్రయత్నంలో ఉన్నాను," అన్నాడు యువకుడు.

"మీ తండ్రి ఏమని ఆశీర్వదించాడు?" అని రాజు అడిగాడు.

"ఇలా మట్టి తీసుకుంటే బంగారం మవుతుందని మా నాన్న చనిపోతూ నన్ను ఆశీర్వదించాడు," అంటూ ఆ కుర్రవాడు నేలకు వంగి, పిడికెడు మన్ను తీసి కిందకి జార విడిచాడు. మన్ను చేతి నుంచి రాలిపోగా యువకుడి చేతిలో ఏదో దిగబడింది.

"ఏమిటది?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో.

"ఏదో ముద్రిక లాగుంది," అంటూ ఆ యువకుడు దాన్ని రాజు చేతిలో పెట్టాడు. అది ఆ రాజుగారి ముద్రికే. ఏడాది క్రితం అది ఎక్కడో పోయింది. దాని పైన గల అభిమానం కొద్దీ రాజు ఎంతో ధనం వ్యయం చేసి ఆ ముద్రిక కోసం వెతికించాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

"నిజంగా మీ తండ్రి ఆశీర్వచనం అమోఘం. నీ అదృష్టాన్ని మార్చటం దేవుడితరం కూడా కాదు," అని రాజు, ఆ కుర్రవాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు. తరవాత ఆ కుర్రవాడే ఈజిప్టుకు రాజు కూడా అయాడు.





# శక్తివేగుడు

## 2

ఇంతలో పొద్దుగూకింది. ఎక్కడెక్కడి నుంచో బ్రహ్మాండమైన ఆకారాలుగల పక్షులు దారుణమైన కేకలు పెట్టుకుంటూ వచ్చి, ఆ చెట్టు పైన వాలి, నిద్రపోయాయి.

ఆ నడిసముద్రం నుంచి బయటపడక పోతే తాను కూడా సత్యవ్రతుడి లాగే నశించటం తప్పదని తెలుసుకుని, శక్తిదేవుడు తన సమీపంలోనే నిద్రపోతున్న ఒక పెద్ద పక్షి వెనుక ఈకలమధ్య దూరాడు. తెల్లవారగానే ఆ పక్షి నిద్రలేచి, ఆకాశంలో ఎగురుతూ మేత కోసం ఎక్కడో ఒక ద్వీపం లోని ఉద్యానవనంలో వాలింది. వెంటనే శక్తిదేవుడు దాని వెనుక ఈకలమధ్య నుంచి కిందికి జారాడు.

అతనా ఉద్యానవనంలో తిరుగుతూం డగా, పూలు కోయవచ్చిన ఇద్దరు స్త్రీలు అతన్ని చూసి ఉలిక్కిపడ్డారు. అతను వారిని సమీపించి, "అమ్మాయిలూ, ఇది ఏ దేశం? మీ రెవరు?" అని అడిగాడు.

"ఇది కనకపురి. విద్యాధరుల దేశం. ఈ ఉద్యానవనం చంద్రప్రభ అనే ఆమెది. ఆమె కొరకే పూలు కోస్తున్నాం," అని వాళ్ళు చెప్పారు. తనను వాళ్ళ యజమానురాలి దగ్గిరికి తీసుకుపొమ్మని శక్తిదేవుడు కోరాడు. వాళ్ళు సరేనన్నారు.

చంద్రప్రభ ఉండే ఇంటికి మణి స్తంభాలూ, బంగారు గోడలూ ఉన్నాయి. అతన్ని దూరాన చూస్తూనే చంద్రప్రభ అతనిచేత ఆకర్షింపబడినదాని లాగా తన ఆసనం మీది నుంచి లేచివచ్చి, "అయ్యా, మీ రెవరు? మానవులకు రారాని ఈ నగరానికి ఎలా వచ్చారు?" అని అడిగింది.

శక్తిదేవుడు దాచకుండా జరిగినదంతా ఆమెకు చెప్పి, కనకరేఖ అనే రాజ



కుమార్తెను పెళ్ళాడగోరి తాను కనకపురిని చూడవచ్చా నన్నాడు. చంద్రప్రభ అతనికి తన వృత్తాంతం ఈ విధంగా చెప్పింది.

శశిఖండు డనే విద్యాధరరాజుకు నలుగురు కుమార్తెలు. చంద్రప్రభ అందరిలోకీ పెద్దది. చంద్రరేఖా, శశిరేఖా, శశిప్రభా అనే వారు వరసగా ఆమె చెల్లెళ్ళు. వాళ్ళందరూ పెరిగి పెద్దవాళ్ళయాక ఒకనాడు చంద్రప్రభ చెల్లెళ్ళు ముగ్గురూ మందాకినీ నదిలో స్నానం చెయ్యబోయి, ఒక మునిని చూసి, యౌవనగర్వం చేత ఆయన పైన నీళ్ళు చల్లారు. ఆ ముని కోపించి, ఆ ముగ్గురినీ మానవజన్మ లెత్తమని శపించాడు.



ఆ సంగతి విని విద్యాధర రాజు వెళ్ళి ఆ మునిని బతిమాలి, వారందరికీ వేరువేరు శాపాంతా లుండేటట్టూ, ముగ్గురికీ మానవ జన్మలో కూడా పూర్వజన్మ జ్ఞానం ఉండేటట్టూ ముని అనుగ్రహం పొందాడు. ఆ కూతుళ్ళు ముగ్గురూ మానవజన్మ లెత్తటానికి పోయాక విద్యాధరరాజు విరక్తి చెంది, కనకపురిని చంద్రప్రభ కిచ్చి, తాను వనవాసం వెళ్ళిపోయాడు.

ఆ తరవాత ఒకనాడు చంద్రప్రభకు కలలో అంబిక కనిపించి, "నీకు మానవుడు భర్త అవుతాడు," అని చెప్పింది. అందువల్ల ఆమె ఏ విద్యాధరుణ్ణీ పెళ్ళాడక, కన్యగానే ఉండిపోయింది.

"ఇప్పుడు మీరు వచ్చారు గనక, నేను మిమ్మల్ని పెళ్ళాడతాను. రానున్న చతుర్దశికి విద్యాధర ప్రముఖులందరూ వృషభగిరికి చేరి అక్కడ శివుణ్ణి అర్చిస్తారు. మా నాన్న కూడా ఆ నాటికి అక్కడికి చేరుతాడు. నేను కూడా అక్కడికి వెళ్ళి ఆయన అనుజ్ఞ పొంది, వెంటనే తిరిగి వచ్చి మిమ్మల్ని పెళ్ళాడతాను. అంతదాకా మీ రిక్కడే ఉండండి," అన్నది చంద్రప్రభ.

తాను వృషభగిరికి బయలుదేరే రోజున ఆమె శక్తిదేవుడితో, "నా వెంట నా పరి



వార మంతా బయలుదేరుతున్నారు. మీ రీ ఇంట ఒంటరిగా ఉండవలిసి ఉంటుంది. మీరు మాత్రం పై అంతస్తుకు ఎక్కవద్దు," అని హెచ్చరించింది.

ఒంటరిగా ఉన్న శక్తిదేవుడు ఏమీ తోచక ఆ భవన మంతా కలయతిరుగుతూ, అనేక విశేషాలు చూస్తూ కాలం గడిపాడు. ఇంక చూసేదేమీ లేక, చంద్రప్రభ తనను పై అంతస్తుకు ఎందు కెక్కవద్దన్నదో తెలుసు కుందామనే అభిలాషతో, అతను మెల్లెక్కి పైకి వెళ్ళాడు. పైన మూడు మండపా లున్నాయి. అతను ఒక మండపం తలుపు తెరిచి లోపలికి వెళ్ళాడు. అక్కడ ఒక రత్నాల మంచమూ, దాని పైన హంస తూలికా తల్పమూ, దాని మీద అపాద మస్తకం కప్పుకుని ఉన్న ఒక మానవాకా రమూ ఉన్నాయి. దుప్పటి ఎత్తి చూసి, అతను విభ్రమం చెందాడు. ఆ పడుకుని ఉన్న మనిషి అచ్చు కనకరేఖ. ఆమె నిద్ర పోతున్న దాని లాగా చెక్కుచెదరకుండా ఉన్నది, కాని ఆమెలో ప్రాణం లేదు.

"ఇది కలా? భ్రమా? ఇంద్రజాలమా? నేను పెళ్ళాడా లనుకుంటున్న స్త్రీ ఇక్కడ చచ్చి ఎలా ప్రత్యక్షమయింది?" అనుకు న్నాడు శక్తిదేవుడు. అతను మిగిలిన రెండు మండపాలలోకి కూడా వెళ్ళి అక్కడ





కూడా మరి ఇద్దరు సౌందర్యవతుల శరీరాలను ఇదే స్థితిలో చూశాడు. అతను ఆశ్చర్యపడుతూ కిందికి దిగి వెళ్ళి, ఇంటి వెలపల ఒక దిగుడుబావిని చూశాడు. దాని పక్కనే ఒక గుర్రం జీనుతో సహా నిలిచి ఉన్నది. దాన్ని ఎక్కి షికారు వెళదామనే ఉద్దేశంతో అత నా గుర్రాన్ని సమీపించాడు. కాని ఆ గుర్రం అతన్ని ఒక్క తన్నుతో ఆ దిగుడు బావిలోకి తోసేసింది. తిరిగి అతను నీటి పైకి వచ్చేసరికి వర్ధమానపురం లోని ఉద్యానపు బావిలో ఉన్నాడు!

అతని కంతా మాయగా ఉంది. విద్యాధరపుర మేమయింది? తాను వర్ధమానానికి ఎలా చేరుకున్నాడు? ఇదంతా ఎవరు చేసిన మోసం? ఇలా ప్రశ్నించుకుంటూ శక్తిదేవుడు తన ఇంటికి వెళ్ళాడు. అతని రాకకు తండ్రీ, బంధువులూ ఎంతో సంతోషించారు.

త్వరలోనే రాజుగారి చాటింపు మరొకసారి అతని చెవిని పడింది. బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని కనకపురిని చూసి వున్నట్టయితే రాజుగారు తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేసి, యువరాజుగా చేస్తారుట. అది విని శక్తిదేవుడు చాటింపు వేసేవారి వద్దకు వెళ్ళి, "కనకపురిని నేను చూశాను," అని చెప్పాడు. వాళ్ళు అతన్ని రాజు గారి వద్దకు తీసుకుపోయారు.

రాజు అతన్ని గుర్తించి, "మళ్ళీ మోసం చేయవచ్చావా?" అన్నాడు.

"మోసం చేస్తే నాకు మీ యిష్టంవచ్చిన శిక్ష ఇవ్వవచ్చు. నన్ను రాజకుమార్తె వద్దకు పంపండి," అన్నాడు శక్తిదేవుడు. రాజు తన కుమార్తెనే అక్కడికి పిలిపించాడు. ఆమె కూడా అతన్ని గుర్తించి, "ఇతను మళ్ళీ ఏవో అబద్ధాలు చెబుతాడు," అని తండ్రితో అన్నది.

"నే నబద్ధాలే ఆడతానో, నిజమే ఆడతానో తరవాత విచారించవచ్చు. ముందీ

మాట చెప్పు: కనకపురిలో పక్క మీద చచ్చిపడుకుని ఉన్నదానివి ఇక్కడ ప్రాణాలతో ఎలాగున్నావు?" అని శక్తిదేవు డడిగాడు. వెంటనే కనకరేఖ తన తండ్రితో, "నాన్నా, ఈయన నిజంగానే కనకపురి చూశాడు. నేను శాపవశాన మానవజన్మ ఎత్తిన విద్యాధరిని. ఈ సంగతి మానవుడు తెలుసుకోవటమే నాకు శాపవిముక్తి. ఇతనే నన్నూ, మిగిలిన నా అక్క చెల్లెళ్లనూ వివాహమాడతాడు," అంటూ ప్రాణాలు విడిచింది.

రాజభవనం రోదనాలతో నిండిపోయింది. శక్తిదేవుడు తాను ఉభయభ్రష్టత్వం పొందాననుకున్నాడు. ఆ క్షణంలో అతను కుంగిపోయినా, తిరిగి ధైర్యం తెచ్చుకున్నాడు. చనిపోయేముందు కనకరేఖ, తానూ తన అక్కచెల్లెళ్ళూ అతనికి భార్యలవుతామని చెప్పనే చెప్పింది. అందుచేత అతను తిరిగి కనకపురికే పోదామనుకున్నాడు. మళ్ళి అంత ప్రయాణమూ చేసి అతను, రేవు పట్టణమైన విటంకపురి చేరుకున్నాడు. అక్కడికి చేరుతూండగానే అతనికి సముద్రదత్తుడు కనిపించాడు. తుఫానులో చిక్కి పడవ పగిలినప్పుడు తాము ఎలా ప్రాణాలతో బయటపడినదీ వారిద్దరూ ఒకరికొకరు తెలుపుకున్నారు.





శక్తిదేవుడా రోజు సముద్రదత్తుడి ఇంట అతిథిగా ఉండి, మర్నాడు కొందరు వర్తకుల వెంట ఒక నౌకలో ఉత్పలద్వీపానికి వెళ్ళాడు. అక్కడ అతను తన బంధువైన విష్ణుదత్తుడి ఇంట బస చేశాడు. అతను వర్తకుల వీధి కుండా పోతూండగా సత్యవ్రతుడి కొడుకులు అతన్ని చూసి, "ఏం, బ్రాహ్మడా, మా నాయనా నువ్వూ కలిసి వెళ్ళారు గదా, నువ్వొక్కడివే వచ్చావేం? మా నాయన ఏడీ?" అని అడిగారు.

"మీ నాయన సముద్రమధ్యాన సుడిగుండంలో పడిపోయాడు," అన్నాడు శక్తిదేవుడు.

"ఒకే పడవలో వెళ్ళే ఇద్దరిలో ఒకడు మాత్రం సుడిగుండంలో పడి రెండోవాడు బతుకుతాడా? నువ్వే మా తండ్రిని చంపావు. నిన్ను రేపు ఉదయం చండికకు బలి ఇస్తాం," అంటూ సత్యవ్రతుడి కొడుకులు అతన్ని పట్టుకుని కట్టేసి, చండికాలయానికి తీసుకుపోయారు.

తనను రక్షించేవాళ్ళెవరూ లేరని గ్రహించి శక్తిదేవుడు ఆ చండికకే దణ్ణం పెట్టి, తనను కాపాడమని వేడుకుని, నిద్రపోయాడు. అతను తిరిగి కళ్ళు తెరిచేసరికి, సత్యవ్రతుడి కూతురు బిందుమతి అనేది అతని కళ్ళబడింది. ఆమె అతన్ని సమీపించి, ఎంతో ప్రేమగా, "నిన్ను నేను కాపాడతాను. నన్ను పెళ్ళాడు. మా అన్నలు నాకెన్ని సంబంధాలు తెచ్చినా వద్దనేశాను, కాని నిన్ను చూడగానే నీకు భార్య కావాలనిపించింది," అన్నది. తరవాత ఆమె అన్నలు వచ్చి, తాము దేవికి బలి ఇద్దామనుకున్నవాణ్ణి తమ చెల్లెలు వరించిందని తెలుసుకుని, వారి పెళ్ళికి ఆమోదించారు. అతనామెను పెళ్ళాడి ఆ ద్వీపంలోనే ఉండిపోయాడు.

ఒకనాడు అతని బావమరుదులు అతని వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చి, "బావా,



ఒక భయంకరమైన పంది జనాన్ని చంపుతూ ఇటుగా వస్తున్నది," అని ఆత్రంగా చెప్పారు. వెంటనే శక్తిదేవుడు ఒక శక్తిని చేతబట్టి, గుర్రాన్నెక్కి, ఆ పంది వెంటపడ్డాడు. అతను శక్తితో కొట్టినా ఆ పంది చావక ఒక బిలంలో దూరింది. శక్తిదేవుడు గుర్రం దిగి, ఆ బిలంలో జొరబడి, కొద్దిసేపట్లో ఒక గొప్ప ఉద్యానవనం ప్రవేశించి, అందులో ఒక అపూర్వసుందరిని చూశాడు.

అతన్ని చూస్తూనే ఆమె భయంతో అతని కేసి పరిగెత్తుకుంటూ వచ్చింది.

"ఎవరు నువు? దేనికి భయపడుతున్నావు?" అని శక్తిదేవు డడిగాడు.

"నేను చండవిక్రమరాజు కుమార్తెను. నా పేరు బిందురేఖ. మాయలమారి రాక్షసు డొకడు నన్నిక్కడికి తెచ్చాడు. వాడు తిండి కోసం పందిరూపంలో బయటికి వెళ్ళి, ఎవరిచేతనో దెబ్బతిని వచ్చి, చచ్చి పోయాడు," అన్న దామె.

"ఆ రాక్షసుణ్ణి కొట్టింది నేనే," అన్నాడు శక్తిదేవుడు.

"నిజంగానా! నీవెవరు?" అని ఆమె మళ్ళీ అడిగింది.

"నే నొక బ్రాహ్మణుణ్ణి. నా పేరు శక్తిదేవుడు," అన్నా డతను.

"అలాగా? అయితే నీవే నాకు కాబోయే భర్తవు," అన్న దామె.

శక్తిదేవు డామెతోబాటు బిలంలో నుంచి బయటికివచ్చి, ఆమెను తమ ఇంటికి తీసుకుపోయి, తన మొదటి భార్య అయిన బిందుమతి ఒప్పుదలతో బిందురేఖను పెళ్ళాడాడు. బిందురేఖ గర్భవతి అయింది. ఆమె గర్భానికి ఎనిమిది మాసాలు నిండగానే, బిందుమతి శక్తిదేవుడితో, "బిందురేఖ గర్భాన్ని చీల్చి, అందులోని శిశువును నా దగ్గిరికి తీసుకురా," అన్నది.

ఈ కోరికకు చాలా దిగులుపడి శక్తిదేవుడు బిందురేఖ వద్దకు వెళ్ళాడు.

అతన్ని చూసి బిందురేఖ, "అలా విచారంగా ఉన్నావేం? బిందుమతి నా గర్భాన్ని చీల్చి తెమ్మన్నదా? అలాగే చెయ్యి. అందులో తప్పేమీ లేదు. భయపడకు," అని చెప్పింది.

శక్తిదేవుడు తన ప్రాణాలను చిక్కబట్టి బిందురేఖ కడుపుచీల్చి, గర్భాన్నిపట్టి పైకి లాగాడు. వెంటనే అది అతని చేతిలో ఖడ్గంగా మారింది; అతను విద్యాధరుడై పోయాడు. ఆ క్షణంలోనే బిందురేఖ అదృశ్యమయింది.

అప్పు డతనితో బిందుమతి, "మేము ముగ్గురమూ శాపం పొందిన విద్యాధర రాజకుమార్తెలము. మాది కనకపురి. మా రెండో అక్కను కనకరేఖగా నీవు వర్ధమానంలో ఎరుగుదువు. ఆమె శాపం తీరి కనకపురి చేరింది. నా మూడో అక్క కూడా శాపం తీరి వెళ్ళిపోయింది. నేను కూడా అక్కడికే పోతున్నాను. మా పెద్ద అక్క చంద్రప్రభ అక్కడే ఉన్నది. నీ ఖడ్గ ప్రభావంతో కనకపురి చేరుకున్నావంటే మా తండ్రి మా నలుగురినీ నీ కిచ్చి పెళ్ళి చేస్తాడు," అని తాను కూడా అదృశ్యురాలయింది.

శక్తిదేవుడు గగనమార్గాన కనకపురి చేరుకున్నాడు. అక్కడి రాజభవనం పై అంతస్తులో శవాలుగా తాను పూర్వం చూసిన కన్యలు ముగ్గురూ ఇప్పుడు ప్రాణాలతో అతడికి కనిపించారు. చంద్రప్రభ కూడా అక్కడే ఉన్నది.

ఆ నలుగురు అక్కచెల్లెళ్ళూ అతన్ని తమ తండ్రి వద్దకు తీసుకుపోయారు. వారి తండ్రి అయిన శశిఖండుడు తన కుమార్తెలను అతని కిచ్చి పెళ్ళిచేసి, విద్యాధర రాజ్యానికి అతన్ని అభిషేకించి, అతనికి శక్తివేగుడని పేరు పెట్టాడు. శక్తివేగుడు తన నలుగురు భార్యలతోనూ సంతోషంగా విద్యాధరరాజ్యాన్ని ఏలుకున్నాడు.





# ఉత్తర కాండ

ఒకనాడు రాముడు కొలువుతీరి ఉండగా, ఒక కుక్క వచ్చి బయట మొరిగింది. లక్ష్మణుడు, ఆ కుక్క రాజుతో ఏదో ఫిర్యాదు చెయ్యగోరుతున్నదని తెలుసుకుని, దాన్ని సభలోకి తీసుకువచ్చాడు.

తల పగిలి ఉన్న ఆ కుక్కను చూసి రాముడు, "నీకు కలిగిన కష్టం గురించి నాతో నిర్భయంగా చెప్పు," అన్నాడు.

"సర్వార్థసిద్ధి అనే భిక్షువు నా తల పగలగొట్టాడు. నేనతనికే అపకారమూ చెయ్యలేదు," అన్నది కుక్క.

రాముడు వెంటనే ఆ భిక్షువును పిలిపించి, "నీవీ కుక్క తల ఎందుకు పగలగొట్టావు? అది నీకేమపకారం చేసింది?" అని అడిగాడు.

"రాజా, నేను భిక్ష కోసం ఇల్లిల్లు తిరుగుతున్నాను. నాకెక్కడా భిక్ష దొరకలేదు. ఈ స్థితిలో ఈ కుక్క నా దారికి అడ్డంగా నిలబడి, ఎంత అదిలించినా పోలేదు. కోపం ఆచుకోలేక దాన్ని తల మీద కొట్టిన మాట నిజమే. దానికేమి దండన విధిస్తారో విధించండి," అన్నాడు సర్వార్థసిద్ధి.

అతనికి ఎలాటి శిక్ష విధిస్తే బాగుంటుందని రాముడు సభలోని వాళ్ళను అడిగాడు. సభలో ఎందరో పండితులుండి కూడా ఒక్కరూ సూటిగా సమాధానం చెప్పలేదు.

అప్పుడు కుక్క రాముడితో, "రామా, ఇతనికి నేను చెప్పిన శిక్ష వెయ్యి. కాలంచర మనే చోట కులపతిగా ఇతనికి



ఉద్యోగమియ్యి," అన్నది. రాము డతనికి ఆ ఉద్యోగం ఇచ్చి, ఏనుగు మీద ఎక్కించి పంపేశాడు. భిక్షువు కూడా పరమానందం చెంది వెళ్ళిపోయాడు.

తరవాత రాముడూ, మంత్రులూ ఆ కుక్కను, "ఆ భిక్షువుకు ఇలాటి శిక్ష ఎందుకు వేయించావు? దీని కేదో కారణం ఉండాలి," అన్నారు.

"నేను కిందటి జన్మలో ఆ ఉద్యోగమే చేశాను. ఆ పదవిలో నాకు చక్కని భోజనమూ, దాసదాసీలూ, సమస్తమూ అమరి ఉండేవి. ఎంతో భూతదయ గలిగి, వినయమూ, శీలమూ కలవాడి ననిపించుకున్నాను. దేవ బ్రాహ్మణ పూజ చేశాను. అయినప్పటికీ ఆ పదవిలో ఉండిన కారణంగా నాకీ నీచజన్మ కలిగింది. మహా కోపీ, దయారహితుడూ అయిన ఈ భిక్షువు ఆ పదవి నిర్వహించాడా జన్మజన్మలకీ ఘోర నరకంపాలు అయితీరుతాడు," అన్నది కుక్క.

కుక్క వెళ్ళిపోయ్యాక ఒక గుడ్లగూబా, గద్దా తగాదాపడి తీర్పు చెప్పమని రాముడి వద్దకు వచ్చాయి. ఒక వనంలో ఒక ఇల్లున్నది. ఆ ఇల్లు నాదంటే నాదని రెండు పక్షులూ తగాదా పడుతున్నాయి. ఈ తగాదా తీర్చేటందుకు గాను రాముడు పుష్పక విమానం మీద తన మంత్రులతో సహా ఆ ఇల్లున్న చోటికి వెళ్ళాడు.

"ఈ ఇంటిని నువ్వెప్పుడు కట్టుకున్నావు?" అని రాముడు గద్ద నడిగాడు.

"భూమి మీద మనుషులు పుట్టిన కాలంలో నేనీ ఇల్లు కట్టుకున్నాను. ఇది నా ఇల్లే," అన్నది గద్ద.

వెంటనే గుడ్లగూబ, "రామా, భూమి మీద చెట్లు ఏర్పడిన కాలంలో నేనీ ఇంటిని కట్టాను," అన్నది.

వెంటనే రాముడి మంత్రులు ఆ ఇల్లు గుడ్లగూబదే నని తేల్చారు. ఎందుచేతనంటే

సృష్టిలో మొదట వచ్చినవి వృక్ష జాతులు. గుడ్లగూబ ఇంటిని కాజెయ్యాలని చూస్తున్నది గనక గద్దను శిక్షిస్తా నన్నాడు రాముడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది.

"రామా, అసలే శాపం తిని ఉన్న ఈ గద్దను ఇంకా ఎందుకు శిక్షిస్తావు? ఈ గద్ద బ్రహ్మదత్తు డనే రాజు, మహా ధనికుడు, శూరుడు, సత్యవ్రతుడు. ఇతని ఇంటికి గౌతముడు వచ్చి అతిథిగా ఉన్నాడు. గౌతముడికి రాజు స్వయంగానే అర్ఘ్యపాద్యాలిచ్చాడు. గౌతముడు బ్రహ్మదత్తుడి ఆతిథ్యం స్వీకరిస్తున్న సమయంలో ఒకనాడు అయన భోజనం లోకి పారపాటున మాంసం వచ్చింది. అది చూసి గౌతముడు కోపించి, రాజును గద్దవు కమ్మని శపించాడు. ఆ తరవాత, ఇక్ష్వాకు వంశంలో పుట్టే రాముడు తాకినప్పుడు శాపవిముక్తి కలుగుతుందని కూడా గౌతము డన్నాడు."

ఆకాశవాణి పలికిన ఈ మాటలు విని రాము డా గద్దను తాకాడు. వెంటనే గద్ద ఒక దివ్యపురుషుడుగా మారింది. ఆ పురుషుడు రాముడికి కృతజ్ఞత తెలుపుకుని వెళ్ళిపోయాడు.

యమునాతీర వాసులైన మునులు నూరుమందికి పైగా రాముడి దర్శనార్థం



ఒకనాడు వచ్చారు. వారు కలశాలతో తెచ్చిన నీరూ, పళ్ళూ మొదలైన కానుకలు స్వీకరించి, వారందరినీ సుఖాసీనులను చేసి రాముడు, వారు వచ్చిన పని అడిగాడు. లవణాసురు డనేవాడు తమని మహాబాధ పెడుతున్నాడనీ, వాడి బాధ నుంచి విముక్తి కలిగించమనీ మునులు రాముణ్ణి కోరారు.

ఈ లవణాసురు డనేవాడు మధు వనే రాక్షసుడి కొడుకు. మధువు రుద్రుణ్ణి గురించి బహుదీర్ఘమైన తపస్సు చేసి, అయనను మెప్పించాడు. దాని ఫలితంగా రుద్రుడు తన త్రిశూలంలో నుంచి మరొక త్రిశూలం చేసి మధువు కిస్తూ, "అది



వెంట ఉన్నంత కాలమూ నిన్నెవరూ జయించలేరు," అని చెప్పాడు. ఆ త్రిశూలాన్ని వంశపరంపరగా తన ఇంటనే ఉండేటట్టు అనుగ్రహించమని మధువు శివుణ్ణి వేడుకున్నాడు. "నీ అనంతరం ఈ త్రిశూలం నీ కొడుక్కు మాత్రమే ఉంటుంది. అటు పైన ఉండదు," అన్నాడు శివుడు. ఆ మధువు రావణుడికి చెల్లెలు వరస అయిన కుంభీనసను పెళ్ళాడాడు. వారికి లవణుడు పుట్టాడు. వాడు పసితనం నుంచీ మహాపాపి. వాణ్ణి మంచిదారిన పెట్టటం మధువు వల్ల కాలేదు. మధువు వరుణలోకానికి వెళ్ళిపోతూ, శివుడు తన కిచ్చిన త్రిశూలాన్ని లవణుడి కిచ్చాడు. దాని అద్భుతశక్తి నెరిగిన లవణుడు మరింత విజృంభించి, అందరినీ బాధిస్తున్నాడు, మునులను మరింత వేపుకుతింటున్నాడు.

మునులు చెప్పిన విషయాలన్నీ ఆలకించి రాముడు వారితో, "లవణాసురుణ్ణి నేను చంపిస్తాను. మీరు నిర్భయంగా ఉండండి," అని అభయమిచ్చాడు. తరవాత అతను తన తమ్ములను చూసి, "లవణాసురుణ్ణి చంపే పనికి ఎవరు పూనుకుంటారు?" అని అడిగాడు.

భరతుడు తా నా పని చేస్తానన్నాడు. కాని శత్రుఘ్నుడు భరతుడి పైన పోటీకి వచ్చి, తానే లవణాసురుణ్ణి చంపుతాననీ, తానుండగా భరతుడు శ్రమపడటం భావ్యం కాదనీ, పడవలసిన శ్రమలన్నీ భరతుడు లోగడ నందిగ్రామంలో ఉన్నప్పుడే పడ్డాడనీ అన్నాడు.

రాము డందుకు ఒప్పుకుని శత్రుఘ్నుణ్ణి మధుపురానికి రాజుగా అభిషేకించే ఏర్పాట్లు చేశాడు. ఒక రాజు చచ్చిపోతే మరొకడు వెంటనే రాజ్యభారం వహించటానికి సిద్ధంగా ఉండాలి. శత్రుఘ్నుడి రాజ్యాభిషేకోత్సవం ముగియగానే రాముడు అతని కొక బాణం



ఇచ్చి, ఇలా చెప్పాడు: "ఈ బాణం మధుకైటభులను చంపినది. దీన్ని నేను రావణుడి పైన కూడా ప్రయోగించలేదు. దీనితో నీవు లవణాసురుణ్ణి చంపు. మరొక సంగతి. లవణుడి వద్ద శివుడి త్రిశూలానికి సమమైన శూలం ఉన్నది. అది వాడి చేతిలో ఉండగా ఎవరూ వాణ్ణి జయించ లేరు. అందుచేత నీ వేం చేస్తావంటే— లవణుడి త్రిశూలం వాడి ఇంటనే ఉంటుంది. వాడు నగరం వదిలి ఎటైనా వెళ్ళి ఉన్న సమయంలో నీవు నగరద్వారం ముట్టడించి, వాడు తిరిగి వచ్చినప్పుడు ద్వారం వద్దనే అటకాయించి చంపు. ఏ పరిస్థితిలోనూ వాడు నగరం లోకి వెళ్ళ రాదు, త్రిశూలం వాడి చేతికి చిక్కరాదు."

అంతేకాదు; శత్రుఘ్నుడు ముందుగా సేనను పంపి, తరవాత తాను ఒంటరిగా వెళ్ళాలి. తనను చంపటాని కెవరో వస్తు న్నట్టు లవణుడికి తెలియగూడదు. గ్రీష్మర్తువు.లోనే సేనలు గంగ అవతలి ఒడ్డు చేరి అక్కడ విడియాలి. శత్రుఘ్నుడు వర్షాకా లారంభంలో విల్లుబాణాలు తీసు కుని బయలుదేరి వెళ్ళి లవణాసురుణ్ణి చంపాలి. ఈ విధంగా రాముడు యుద్ధగతి నిర్ణయించాడు.



ఆ ప్రకారమే శత్రుఘ్నుడు ముందుగా తన సేనలను పంపి, ఒకమాసం గడిచాక తాను బయలుదేరాడు. దారిలో రెండు రోజులపాటు అతను వాల్మీకి ఆశ్రమంలో నిలిచాడు. వాల్మీకి అతనికి ఆతిథ్య మిచ్చి, ఆ ఆశ్రమం ఒకప్పుడు రఘువంశం వారిదే నంటూ దాని కథ ఇలా చెప్పాడు:

రఘు వంశంలో ఒకప్పుడు సుదాసు అనేవా డుండేవాడు. ఆయన కొడుకు వీరసహుడు. చిన్నతనంలోనే వేటకు వెళ్ళి, వనంలో ఇద్దరు రాక్షసులను చూశాడు. ఆ రాక్షసులు పులుల రూపంలో తిరుగుతూ కనిపించిన మృగాన్నెల్లా తినేస్తూ, అరణ్య



మంతా పాడుపెట్టేశారు. ఎక్కడా ఒక మృగం లేదు. అది చూసి వీరసహుడికి చాలా కోపం వచ్చింది. అత నా రాక్షసు లిద్దరినీ చూస్తూనే వారిలో ఒకణ్ణి చంపే శాడు. అప్పుడు రెండోవాడు, "పాపీ, అకార ణంగా నా అనుచరుణ్ణి చంపావుకదూ? నిన్నేం చేస్తానో చూడు," అంటూ అదృశ్యు డయిపోయాడు.

కొంతకాలం గడిచింది. ఆ రాజు ఇదే ఆశ్రమంలో ఒక బ్రహ్మాండమైన అశ్వమేధ యాగం చేశాడు. వసిష్ఠుడే ఆ యాగం చేయించాడు. యాగం పూర్తి అయేసరికి వెనకటి రాక్షసుడు, రాజుపైన పగబట్టి ఉన్న వాడు గనక, వసిష్ఠుడి రూపంలో వచ్చి, "రాజా యజ్ఞం పూర్తి అయింది. నాకు చక్కని మాంసభోజనం పెట్టు," అని అడిగాడు.

రాజు సంతోషించి వంటవాణ్ణి పిలిచి, "గురువుగారికి హవిస్సు మాంసంతో రుచిగా భోజనం తయారుచెయ్యి," అన్నాడు. ఈ లోపుగానే రాక్షసుడు వంటవాడి రూపంలో నరమాంసంతో వంట సిద్ధం చేసి, రాజుకు చూపించి, "హవిస్సుతో చక్కని వంట చేశాను," అన్నాడు. రాజు వసిష్ఠుడికి తన భార్య అయిన మదయంతి చేత ఆ నరమాంసం వడ్డింపించాడు. వసిష్ఠుడు తనకు వడ్డించినది నరమాంస మని గుర్తించి, ఆగ్రహించి, "నువు నర భక్షకుడి వైపో!" అని రాజును ఘోరంగా శపించాడు.

రాజుకు కూడా కోపం వచ్చి, వసిష్ఠుణ్ణి శపించటానికి నీరు చేతిలోకి తీసుకున్నాడు. కాని అతను శపించే లోపుగా మదయంతి అడ్డుపడి, "ఆయన మనకు దేవుడిలాటి వారు. ఆయనను శపించరాదు," అన్నది. అప్పుడు రాజు చేతిలో నీళ్ళను తన పాదాల మీదనే పోసేసుకున్నాడు. ఆ నీటి వల్ల రాజు పాదాలకు కల్మషం కలిగింది.

అప్పటి నుంచీ అతనికి కల్మాషపాదు డనే పేరు వచ్చింది.

తరవాత వసిష్ఠుడు జరిగిన సంగతి గ్రహించి, కల్మాషపాదుడికి శాపఫలం పన్నెండేళ్ళే ఉండేటట్టు అనుగ్రహించాడు. రాజు పన్నెండేళ్ళ పాటు నరభక్షకుడుగా జీవించి, శాపం తీరి మామూలు మనిషి అయి, ఎప్పటి లాగే రాజ్యపాలన చేశాడు.

ఈ కథను వాల్మీకి వల్ల విని శత్రుఘ్నుడు పర్ణశాల ప్రవేశించే సమయానికి సీత కవలపిల్లలను కన్నది. ఈ వార్త ముని కుమారుల ద్వారా వినగానే వాల్మీకి వెళ్ళి, బాలచంద్రుల్లాగా ప్రకాశించే పిల్లలను చూసి, రక్షలు కట్టి, పెద్దవాడికి కుశుడనీ రెండోవాడికి లవుడనీ పేర్లు పెట్టాడు.

ఇది జరిగింది సరిగా అర్ధరాత్రి వేళ. ఆ సమయంలోనే శత్రుఘ్నుడు సీత వద్దకు వెళ్ళి, "అమ్మా, అదృష్టం," అని ఎంతో సంతోషించాడు. మర్నాడు అతను వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, పడమరగా ప్రయాణిస్తూ, ఏడు రోజులకు యమునా తీరం చేరి, అక్కడి మునుల ఆశ్రమాలలో సత్కాలక్షేపం చేస్తూ ఆ రాత్రి గడిపాడు.

మర్నాడు తెల్లవారగానే శత్రుఘ్నుడు చ్యవన మహాముని ని లవణాసురుణ్ణి గురించీ, వాడి త్రిశూలం గురించీ అడిగాడు.



వా డా శూలంతో ఎన్నో దారుణాలు చేశాడని చెబుతూ చ్యవనుడు మాంధాత వృత్తాంతం వివరించి చెప్పాడు.

అయోధ్య రాజైన యువనాశ్వుడి కుమారుడు మాంధాత. మహాబలవంతుడైన ఆ మాంధాత భూమిలో ఉండే రాజులనందరినీ జయించి, స్వర్గానికి వెళ్ళి దాన్ని కూడా జయించ నిశ్చయించాడు. ఆ సంగతి తెలిసి, ఇంద్రుడు మొదలైన దేవతలు భయపడ్డారు. ఇంద్రుడి అర్థాసనమూ, దేవతల సేవా కోరి వచ్చిన మాంధాతతో ఇంద్రుడు మంచిగానే, "ముందు భూలోకాన్ని జయించి రా, అప్పుడు దేవలోకాన్ని నీ కిచ్చేస్తాం," అన్నాడు.

"అదేమిటి? భూలోక మంతా అదివరకే జయించాను. అక్కడ నా శాసనానికి ఎదురులేదు," అన్నాడు మాంధాత.

"మధువనంలో లవణాసురు డనేవాడున్నాడు. వాడు నీకు లోబడి నడుచుకుంటున్నాడా?" అని ఇంద్రుడు మాంధాతనడిగాడు.

మాంధాత సిగ్గుపడి తల వంచుకుని భూమికి తిరిగి వచ్చి, లవణుణ్ణి జయించటానికి సేనా సమేతుడై బయలుదేరి వెళ్ళి, తనకు లొంగిపొమ్మని దూత ద్వారా లవణుడికి కబురు చేశాడు. లవణు డా దూతను పట్టుకుని తినేశాడు.

ఎంత కాలానికీ దూత తిరిగి రాకపోగా మాంధాత లవణుడి పైన యుద్ధం ప్రారంభించాడు. లవణుడు మాంధాతను చూసి నవ్వి, తన శూలాన్ని ప్రయోగించే సరికి, అది మాంధాతతో సహా అతని సైన్య మంతటినీ భస్మం చేసేసింది.

చ్యవను డీ సంగతి చెప్పి, "వాడి చేతిలో ఆ త్రిశూలం లేని సమయంలోనే నువు వాణ్ణి చంపాలి. రేపే ఆ పని చెయ్యగలుగుతావు," అన్నాడు. ఆ రాత్రి కబుర్లతో సులువుగా గడిచిపోయింది.





ఆరంభంలో సూర్యమండలం ఇప్పుడున్న దాని కన్న చాలా పెద్దదిగా ఉండేది. సూర్య కిరణాలు ప్రచండంగా ఉండి అన్ని లోకాలనూ మలమల మాడ్చివేస్తూ ఉండేవి.

సూర్యుడి ఉధృతాన్ని తగ్గించమని బ్రహ్మదేవుడు విశ్వకర్మను కోరాడు. విశ్వకర్మ సూర్యుణ్ణి తరణిబట్టి, లోకాలు నిరపాయంగా ఉండేలాగా తగ్గించాడు. సూర్యుణ్ణి తరణి బట్టగా రాలిన రజంతో విశ్వకర్మ చక్రాయుధాన్ని తయారు చేసి మహావిష్ణువుకు సమర్పించాడు.

మహావిష్ణువుకు విశ్వకళ అనే ఒక మానసపుత్రిక ఉండేది. విష్ణునాభికమలం నుంచి బ్రహ్మ పుట్టినప్పుడే, విష్ణు మానస పద్మం నుంచి విశ్వకళ పుట్టింది. ఆమె కళకు అధిదేవత.

విశ్వకర్మ తన కుమార్తెకు తగినవాడని తేచి విష్ణువు ఆమెను విశ్వకర్మకు భార్యగా ఇచ్చాడు. విశ్వకర్మ విశ్వకళతో కాపరం చేస్తూ మహదానందం పొందాడు.

ఇంతలో శివుడూ, ఇంద్రుడూ తమకు కూడా ఆయుధాలు చేసి ఇవ్వవలసిందిగా విశ్వకర్మను కోరారు. వారి కోరికను నెరవేర్చటం విశ్వకర్మ విధి అయింది. అదీగాక సూర్యుడి తాలూకు రజం ఇంకా చాలా మిగిలి ఉన్నది.

విశ్వకర్మ సూర్యరజంతో శివుడికి త్రిశూలాన్నీ, ఇంద్రుడికి వజ్రాయుధాన్నీ తయారు చెయ్య నారంభించాడు.

కొత్త దాంపత్యపు మోజు తీరని విశ్వకళ, తన భర్త అస్తమానమూ ఆయుధ నిర్మాణంలో మునిగి ఉండటం సహించలేక పోయింది. అంతేగాక, తన తండ్రితో సమంగా శివుడికీ, ఇంద్రుడికి తన భర్త అయుధా లెందుకు చేసి ఇవ్వాలన్న దురభిమానం విశ్వకళకు పట్టుకున్నది.

అట్ట చివరి బొమ్మ

ఇలా భర్త మీద అలిగి విశ్వకళ తన పుట్టిల్లయిన వైకుంఠానికి వెళ్ళిపోయి, విష్ణువుతో తన భర్తను గురించి ఫిర్యాదు చేసింది. విష్ణువు ఆమె చెప్పినదంతా విని, ఏమీ అనక, చిరునవ్వునవ్వి ఊరుకున్నాడు.

విశ్వకళ వెళ్ళిపోయాక విశ్వకర్మ భార్యావియోగంతో తపించి పోసాగాడు. అతను తన శిల్పశక్తి నంతా ధారపోసి, విశ్వకళకు ప్రతిరూపంగా ఆమె విగ్రహం నిలువెత్తుది తయారు చేసి, ఇతర పను లన్నీ మరిచి, ఆమె విగ్రహంతోనే సరస సల్లాపాలాడుతూ అహోరాత్రాలు అక్కడే కాలం గడపసాగాడు.

ఒకనాడు బ్రహ్మదేవుడు విశ్వకర్మతో పని పడి వచ్చేసరికి, విశ్వకర్మ విశ్వకళ విగ్రహం దగ్గిర మోకరించి, ఆ విగ్రహాన్ని ఆలింగనం చేసుకుని, కళ్ళు మూసుకుని తన్మయత్వంలో మునిగి ఉండి కనిపించాడు. ఇది చూసి బ్రహ్మకు చాలా కోపం వచ్చింది. ఆయన గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళి పోయేటప్పుడు ఆయన చేత నున్న కమండలం లోని ప్రాణోదకం తొణికి, ఒక చుక్క విగ్రహం మీద పడింది. వెంటనే ఆ విగ్రహానికి ప్రాణం వచ్చింది.

విశ్వకర్మ కళ్ళు తెరిచి చూసేసరికి విశ్వకళ ప్రాణంతో ఎదట కనిపించింది.



ఆమె పుట్టింటి నుంచి తిరిగి వచ్చేసిందను కుని అతను పరమానందం చెందాడు. బ్రహ్మ రావటం గాని, పోవటం గాని అతని కే మాత్రమూ తెలియదు. అంతేగాక, తాను విశ్వకళ ప్రతిమను తయారు చేసిన సంగతి కూడా అతను పూర్తిగా మరిచాడు.

ఇప్పుడు విశ్వకర్మ పూర్వంకన్న కూడా హెచ్చుగా తన ప్రతిమాభార్యను ప్రేమిస్తూ కాలం గడిపాడు. కొంత కాలానికి ప్రతిమా విశ్వకళ గర్భవతి అయింది. క్రమంగా ఆమెకు నెలలు నిండాయి.

కలహభోజనుడైన నారదుడికి మంచి అవకాశం దొరికింది. అయన విష్ణువు దగ్గిరికి వెళ్ళి, ఆ కబురూ, ఈ కబురూ మాట్లాడి, "అన్నట్టు, మీ అల్లుడు విశ్వకర్మ తండ్రి కాబోతున్నాడు గదా, మీరు సకుటుంబంగా వెళ్ళి, పుట్టబోయే మనమడికో మనమ రాలికో బారసాలా, నామకరణమూ మొద లైనవి జరిపించాలి కాబోలు," అన్నాడు.

సమీపంలోనే ఉండి, నారదుడి మాటలు వింటున్న విశ్వకళ నిర్ఘాంతపోయి నారదుడి ఎదటికి వచ్చింది.

ఆమెను చూసి నారదుడు, ఈమె ఎవ రన్నట్టు ఆమె కేసి ఆశ్చర్యంగా చూశాడు.

ఏమిటి ఈ ముచ్చుముని ఆడే నాటకం అన్నట్టు విశ్వకళ విష్ణువు కేసి చూసింది.



నాకు మాత్రం ఏం తెలుసు నన్నట్టు విష్ణువు మిగిలిన ఇద్దరి కేసీ చూశాడు. వస్తా నని చెప్పి నారదుడు చల్లగా జారుకున్నాడు.

నారదుడి మాటలకు ఆగ్రహం చెంది ఉన్న విశ్వకళ తన భర్త వద్దకు వెళ్ళింది. ఆమె వచ్చేసరికి ప్రతిమావిశ్వకళ ఇంటి ముందు ఆవరణలో పూల మొక్కలకు నీరు పోస్తున్నది.

"నన్ను పోలి ఉన్నావు, ఎవతెవే నీవు?" అని విశ్వకళ గట్టిగా అరవటం వినిపించి, ఇంటిలోపల శిల్పంలో నిమగ్నుడై ఉన్న విశ్వకర్మ వెలపలికి వచ్చి, ఇద్దరు విశ్వకళలను చూసి నివ్వెరపోతూ, "వీరిలో అసలు నిలుచుగాక, నకలు శిల అయిపోవు గాక!" అన్నాడు. వెంటనే ప్రతిమావిశ్వకళ ప్రతిమగా అయిపోయింది.

అప్పటికీ విశ్వకళకు కోపం పోలేదు. ప్రతిమావిశ్వకళ మీద పుట్టుకొచ్చిన అసూయ కొద్దీ ఆమె, లోపలి నుంచి పెద్ద సుత్తె తెచ్చి, దానితో ప్రతిమను గట్టిగా కొట్టింది. విగ్రహం పగిలిపోయి అందులో నుంచి రత్నంలాటి ఆడశిశువు కేరుమని ఏడుస్తూ కింద పడింది.

వెంటనే విశ్వకళకు కోపం చల్లారిపోయి, మాతృప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె ఆ శిశువును ఎత్తి తన గుండెకు హత్తుకున్నది. దంపతులిద్దరూ ఆ బిడ్డను చూచి తెగమురిసి పోతూండగా, లక్ష్మినారాయణులు తమ కుమారుడైన బాలమన్మథుణ్ణి వెంటపెట్టు కుని వచ్చేశారు. లక్ష్మిదేవి ఆ పిల్లను చూసి చాలా ముచ్చటపడి, తన కొడుక్కు చేసుకుంటా నన్నది. విష్ణువు ఆ శిశువుకు "రతి" అని నామకరణం చేశాడు.

రతీదేవి పెరిగి పెద్దదై మూడు లోకాల లోనూ సాటిలేని సౌందర్యవతి అనిపించు కున్నది. రతీ మన్మథులు దంపతులై, శృంగారసామ్రాజ్యాన్ని ఏలుతూ, విశ్వ మంతటా వీరవిహారం చేశారు.



# 54. కాల్స్‌బాడ్ గుహలు

మెక్సికోలో ఉండే ఈ అద్భుతమైన గుహలు 1924 లో ప్రపంచానికి తెలియవచ్చాయి. దిగువ చిత్రం లోని గుహ ఎత్తు 300 అడుగులు, నిడివి 625 అ. దాకా ఉన్నది, లోతు 4,000 అడుగులు. ఇందులో కనిపించే స్తంభాల లాటివి, అనేక వేల ఏళ్ళపాటు పెరిగిన సున్నపురాతి నిర్మాణాలు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

బొమ్మకు పాప అమ్మ

పంపినవారు:
ఆర్. యస్. జయరాజు, హైదరాబాదు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 జులై నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అమ్మకు పాప బొమ్మ

రెండవ ఫోటో : బొమ్మకు పాప అమ్మ

పంపినవారు : ఆర్. యన్. జెయరాజు,

డప్టన్ రోడ్, హైదరాబాదు

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# చిన్న పిల్లలకు చిత్రమైన బొమ్మల పుస్తకాలు

## కాగితాలను కత్తిరించి చేసే ఊరిగామీ ల్యాండ్

రంగు కాగితాలను మడిచీ, కత్తిరించీ జపాను పిల్లలు చక్కనైన జంతువులనూ, ముచ్చటైన పక్షులనూ, అందమైన పువ్వులనూ చేస్తున్నారు. స్వంత కల్పనతో, స్వహస్తాలతో మన పిల్లలూ చేయవచ్చు. అటువంటివి ఎలా చేయాలో బోధించే అద్భుత పుస్తకం ఇప్పుడు సిద్ధంగా వుంది. దాన్ని కొని, తలిదండ్రులందరూ పిల్లలను ప్రోత్సహించాలి.

అందరకూ అర్థమయ్యే అతి సులభమైన ఇంగ్లీషు భాషలో ఈ పుస్తకం వెల రూ. **2**

## ★ ఇంపైన పాటలు పాడే బొమ్మల పుస్తకం

చిన్న పిల్లలకు వింత కొలిపి, సరదా పుట్టించే ఇటువంటి బొమ్మల పుస్తకం ఇప్పుడే వెలువడింది. అందమైన ఈ పుస్తకం రకరకాల ధ్వనులను చేస్తుంది. ధ్వనులకు తగిన బొమ్మలు, బొమ్మలకు సరిపడే అక్షరాలు ఇందులో వున్నాయి.

తెలుగులో ఈ పుస్తకం వెల రూ. **1-50**

ముందుగా సొమ్ము పంపువారికి పోస్టేజి ఉచితము.

## హిగ్గిన్‌బాదమ్స్ ప్రైవేట్ లిమిటెడ్

**165**, మౌంట్ రోడ్డు :: మదరాసు - **2**



## చక్కటి కురులకు సౌందర్య పోషణ

నిత్యమూ ఉదయాన్నే 'కేశవర్ధిని' రాచుకొని తల దువ్వుకోండి—నిగనిగలాడుతూ ఎంతో చక్కని కురులు వర్ధిల్లుతాయి. చుండు చేరదు. అందము, ఆరోగ్యకరములగు కురుల పెరుగుదలకు 'కేశవర్ధిని'నే వాడండి.




అప్పటికప్పుడు తాజా వాడుకకు

### కేశవర్ధిని రెడీ మిక్స్‌డ్ హేరాయిల్

శుభ్రతకు, పరిమళయుతమైన కురులకు కేశవర్ధిని షాంపూ

## కేశవర్ధిని ప్రొడక్ట్స్,

**27**, మాసిలామణి ముదలియార్ రోడ్డు, మదరాసు - **14**.



# నిరాల

## వేరు మాదిరి ఒక ఉతికే సబ్బు

వేరు మాదిరి రూపము: నిరాల సబ్బుతో ఉతికిన బట్టలు వేరు మాదిరిగా కనబడతాయి — తెల్లటి బట్టలు ఎక్కువ తెల్లగాను, రంగు బట్టలు ఎక్కువ ఉజ్వలంగాను వుంటాయి!

వేరు మాదిరి పని: వాడి చూడండి, దాని ప్రభావము! నిరాల అత్యుత్తమంగాను, త్వరగాను ఉతుకుతుంది. మురికిని పూర్తిగా తొలగిస్తుంది.

వేరు మాదిరి ధర: నిరాల యొక్క సమృద్ధయిన నురగ అంత సబ్బుతోనే ఎక్కువ బట్టలను ఉతుకును. నిజంగా, మీరు సొమ్మును మిగుల్చుకో గలరు!

నిరాల — వేరు మాదిరి సబ్బు. దానిలో జంతువుల క్రొవ్వు లేదు.




తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.

ASP/N-7 TEL.

తీసుకోండి

# గెవార్ట్ గెవాబాక్స్

దాని ఆకర్షణీయమైన బోడీ అత్యుత్తమమైన స్టీల్‌తో చేయబడినది!

గెవాబాక్స్ బోడీ మాత్రమే ఆ తరగతికి చెందిన వాటిలో, పూర్తిగా, అత్యుత్తమమైన స్టీల్‌తో చేయబడినది. అది విరగక, వంగక...సంవత్సరాల తరబడి వుండును. అంతే కాదు_గెవాబాక్స్‌తో సహజంగా, ఉత్కృష్టమైన ఫలితాలు లభిస్తాయి.

ఈ విశేషమైన లక్షణముల వలన గెవాబాక్స్ సర్వోత్తమమైనది.

- □ సరియైన కాంపోజిషన్, శీఘ్రమైన, సులభమగు, ఛాయా చిత్రముల కొరకు, ఉజ్వలమైన. స్పష్టమగు అయ్-లెవెల్ వ్యూఫైండర్.
- □ 3 స్పీడ్‌లు (బల్బ్, 1/50వ మరియు 1/100వ సెకండ్‌లు) స్పష్టమైన ఫాస్ట్_ఏక్షన్ షాట్‌లను తీసుకోండి.
- □ దూరపు వస్తువులకు ఫోకస్ చేసుకునేందుకు 2 ఎపర్చెర్‌లు (f 11 మరియు f 16)
- □ అద్భుతమైన దీర్ఘ చతురస్రాకారపు ఛాయా చిత్రములు 6 సెం.మీ. × 9 సెం.మీ., అంత పెద్దవి ఆ తరగతిలో పోల్చదగిన కెమేరాల నుండి వచ్చేవాటికంటే ప్రతీదీ 50% పెద్దది. అత్యంత ఉత్తమమైన ఎన్‌లార్జ్‌మెంట్‌లు లభిస్తాయి.

మరియు గెవాబాక్స్‌ను ఉపయోగించడం ఎంతో సులభం. ఒక సారి క్లిక్ చేయండి, మిగిలినదంతా మీ గెవాబాక్స్ చేస్తుంది. మీ వర్తకుని చూపించమని అడగండి. ఖరీదు : రూ. 44.00

ప్రొఫెషనల్ చిత్రములను తీసే ప్రజాదరణ పొందిన కెమేరా!




## గెవార్ట్ గెవాబాక్స్




ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ లిమిటెడ్,
కస్తూరి బిల్డింగ్, జమ్‌షెడ్జీ టాటా రోడ్, బొంబాయి-1.

Bensons/I-APL-2 TL

ఊరగాయ పచ్చళ్లకు

అమూల్యమైననూనెలు

అగ్‌మార్కుచేయబడిన

ఎ.యస్.బ్రాండ్

చాయపప్పు

నూనె







అగ్‌మార్కు చేయబడిన

మేన్షన్‌బ్రాండ్

నువ్వులనూనె

ముక్కును మెత్తబడనీయవు.........

బూజుపట్టనీయవు...............

చాలకాలము నిలువయుండును.

16, 4, 2. కిలోగ్రాముల డబ్బాలలో

పేకింగు చేయబడుచున్నవి.....

ఇండియన్‌గవర్నమెంటువారి అగ్

మార్కు సీలును గమనించకొనుడు.

డిపోలు :

శ్రీ G. సుబ్బారావు
డాక్టరు వుల్లక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ B. గోపాలకృష్ణమూర్తి
1.3-166 రాజా ముదలియార్ స్ట్రీటు
కలాసిగుడ, సికింద్రాబాద్

ఏజెంటు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్య
శివాలయం స్ట్రీటు, విజయవాడ

MFRS, అంబటి సుబ్బన్న అండ్ కో. సామర్లకోట







New

Teeth Cleaning Unit

'Kashmir'

TOOTH PASTE
TOOTH POWDER
and
TOOTH BRUSH

by
THE NATIONAL TRADING CO.
Manufacturers of
KASHMIR SNOW BEAUTY AIDS
BOMBAY-2, MADRAS-32.

శ్రీ శంభు ఫిలింస్ వారి
సమర్పణ!



తెలుగు సంస్కృతికీ,
నాగరికతకూ నుడికారము
దిద్దిన తొలి తెలుగు చక్రవర్తి





శ్రీకాకుళ
# ఆంధ్ర మహావిష్ణు
కథ



నిర్మాత: దగ్గుబాటి లక్ష్మీనారాయణ చౌదరి . దర్శకత్వం: ఏ.కె.శేఖర్

కథ, మాటలు, పాటలు: పింగళినాగేంద్రరావు. సంగీతం: పెండ్యాల

ఆంధ్ర, సీడెడ్: విజయ
నైజాం: ఉషాఫిలింస్

VIJAYA

